23.2.1996 శుక్రవారం 12 పేజీలు సంపుటి:68 సంచిక:08 విడిప్రతి రూ. 2.00 లు Phone: 27354 Regd. No. HNL 18

# జమీన్‌రైతు

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు    జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి



### ముప్పయ్ మందికి ముడుపులిస్తే ఓట్లేసింది ఐదుగురే!

# డబ్బు తినీ ఎగనామం పెట్టారా ఎమ్మెల్యేలు?

## పెద్దరికం లోపించిన పెద్దల సభ ఎన్నికలు

పెద్దల సభకు జరిగిన పెద్దల ఎన్నికల్లో పెద్దరికం లేకుండా పోయింది. ఓటుకు నోటు అన్న అస్త్రంతో అంత రాత్మల్ని మానసిక ధన దౌర్బల్యాన్ని తట్టి లేపటంలో అన్ని పార్టీలూ పోటీలు పడ్డాయి. సాక్షాత్తు ముఖ్యమంత్రి అంతటి వాడే రంగంలోకి దూకి ఎమ్మెల్యేల్ని నయానా ? -భయానా లోబర్చుకునే టక్కుటమార విద్యల్ని ప్రయోగించటంతో చివరి నిముషం వరకు ఉత్కంఠత నెలకొన్నది. మొత్తం ఆరు సీట్లకు జరిగిన ఎన్నికలో మొదటి అయిదు సీట్లూ సునాయాసంగా గెలుచుకునే అవకాశం వుండగా ఆరో సీటుకు కూడా పోటీ పెట్టి ముఖ్య మంత్రి ఎన్నికల కార్యక్రమాన్ని రక్తి కట్టించారు. జాతీయ పార్టీ కూడా తానేమీ తీసి పోలేదని రుజువు చేసుకుంటూ టి. వెంకట్రామ రెడ్డిని ఇండి పెండెంట్ ముసుగులో రంగంలోకి దింపటం. ఎన్టీఆర్ గ్రూపు తరపున డాక్టర్ దగ్గుబాటి వెంకటేశ్వర రావు ఎన్నికల బరిలో నిలవటం. 34 సీట్లు మాత్రమే వున్న ఉభయ కమ్యూనిస్టులు మరో 8 సీట్ల కోసం చంద్రబాబును బిచ్చ మెత్తటం ప్రస్తుత రాజ్యసభ ఎన్నికల్లో ముఖ్య విశేషాలు. కాగా ఓటింగ్‌కు ముందు రోజు వరకు కూడా ఆయారామ్ గయారామ్‌లు అధికార పక్షంలోకి దూకి ఎన్నికలకు మరింత సొగసును సమకూర్చారు. మొత్తం 189 ఓట్లున్న చంద్రబాబు కమ్యూనిస్టుల 34 ఓట్లను కలుపుకొని 223 ఓట్లతో ఆరు రాజ్యసభ స్థానాల్ని కైవశం చేసు కునేందుకు చంద్ర వ్యూహం పన్నారు. చివరి నిముషంలో ఎన్టీఆర్ గ్రూపు నుంచి మరో ముగ్గురు ఎమ్మెల్యేల్ని లాక్కొని తన స్కోరును 226 కు పెంచుకో గలిగారు. ఇందులో తలా 37 ఓట్ల వంతున పంచి, రెండో ప్రాధాన్యతా ఓటును కూడా ఉపయోగించు కుంటే ఆరు సీట్లు కూడా దక్కించు కోవచ్చన్నది చంద్రబాబు వ్యూహం. అయితే అసెంబ్లీ బలాబలాల ప్రకారం మొదటి ప్రాధాన్యత ఓట్లు 42 వస్తే అభ్యర్థి ఎంపికకు ఢోకా వుండదు. దీని ప్రకారం 34 ఓట్లున్న కమ్యూనిస్టులు తమకు 8 ఓట్లు కేటాయించాల్సిందేనని పట్టు బట్టారు. అయితే కమ్యూనిస్టులకు 8 ఓట్లు కేటాయిస్తే తన అభ్యర్థులకు 4 ఓట్లు తగ్గుతాయని ముఖ్య మంత్రి సందేహించటం, దానికి కమ్యూనిస్టు మిత్రులు కించిత్ అలక వహించటం కూడా జరిగింది. ఇలా వుండగా రెండో ప్రాధాన్యత ఓటును డాక్టర్ వెంకటేశ్వర రావుకు ఇచ్చేందుకు కమ్యూనిస్టులు లోపాయి కారిగా గ్రీన్ సిగ్నల్ ఇవ్వటంతో చంద్రబాబు తన వ్యూహాన్ని మార్చుకొన్నారు. కాంగ్రెస్ పార్టీలో ఊగిస లాడుతున్న వంగవీటి రత్నకుమారి మద్దతు సంపా దించటంలో బాబు కృతకృత్యు డయ్యాడు. అలాగే పనులు చేసి పెడ్తానని మరి కొందరు కాంగ్రెస్ ఎమ్మెల్యేలకు గాలం వేశాడని అంటున్నారు. ఎన్టీఆర్ గ్రూప్‌లో వున్న ఇండి పెండెంట్ సభ్యుడు గడ్డె రామ్మోహన్‌కు వాణిజ్య పన్నుల బకాయి గండాన్ని అద్దంలో చూపించి తన వైపుకు

కొరవ 12 పేజీలో



మాజీ ముఖ్యమంత్రి నేదురుమల్లి జనార్ధనరెడ్డి తనయుడి పరిణయోత్సవంలో - కేంద్రమంత్రి కమలనాథ్, పివి రంగారావు, కోట్ల విజయభాస్కరరెడ్డి, ప్రధాని పివి నరసింహారావు, జనార్ధనరెడ్డి, శ్రీమతి రాజ్యలక్ష్మి, వధూవరులు - గౌతమ్, సంగీత, గవర్నర్ కృష్ణకాంత్, మూపనార్, తిక్కవరపు సుబ్బరామరెడ్డి

# ఆ పెండ్లి వేడుక చూడ వేయి కనులు చాలలేదు!




సీతారాముల కళ్యాణం చూతము రారండీ అని పిల్చాడు వెనకటి కొక సినిమా కవి. ఆ వైభవం కనులారా కాంచడానికి కాల చక్రాన్ని త్రేతాయుగపు నడిమికి వెనక్కు త్రిప్పే మీటలేవీ మన వద్ద లేవు. కాని అదెంత గొప్పగా వుండి వుంటుందో, మదినెంత అబ్బుర పరచి, ఆశ్చర్యార్నందాబ్ధిలో ఓలలాడించి వుంటుందో శాంపిల్ చూడాలను కునే వారు మాత్రం జనార్దన రెడ్డి గారి కుమారుడి పెండ్లికి వెళ్లి వచ్చి వుంటే సరిపోయేది.

మాజీ ముఖ్యమంత్రి, రాష్ట్ర కాంగ్రెస్ నాయకుడు జనార్దన రెడ్డి గారి మూడవ కుమారుడు గౌతమ్‌కు; పూర్వాశ్రమంలో నెల్లూరీయుడు, ప్రస్తుత హైదరాబాదు పారిశ్రామికుడు, ఉన్నతి కెదిగినా వినయం వీడని సౌశీల్యుడు, పెరిగిన వయస్సు పైకి కన్పడకుండా యువ్వన ఛాయలు కాపాడు కొంటున్న స్ఫురద్రూపి శ్రీ కోడూరు వరప్రసాద రెడ్డి తనయ సంగీతకు 15 తేది ఉదయం హైదరాబాదులోని సిక్కు విలేజిలో పరిణయం జరిగింది.

జనార్దన రెడ్డి గారి ప్రథమ కుమారుడి పెళ్ళినాటికి ఆయన ముఖ్య మంత్రి. అందువల్ల ఆ కార్యక్రమంలో అధికారా డంబరం తప్ప ఆర్ద్రత కన్పరిచే అవకాశం చిక్కలేదు. ఆ లోటు ఇప్పుడు తీర్చుకున్నా రాయన. పెళ్లికి జరిపిన ఏర్పాట్లు చూసి ఆహూతులకు దిమ్మ తిరిగి పోయింది. ఆకాశమంత పందిరి క్రింద, భూదేవంత పీట వేశారంటారే - ఆ ఉపమానానికి నియరెస్ట్ ఎగ్జాంపుల్ ఈ పెళ్లి. అరణ్య సదృశ్యంగా వుండిన సిక్కు విలేజి మైదానంలో భూతల స్వర్గం సృష్టించారు. పెండ్లి మండపం సమస్తం వివిధ వర్ణ కుసుమ శోభితం. ఘుమఘుమ లాడే సువాసన సమన్వితం; రెండు పందల మందికి పైగా సుఖాసీను లయ్యేంత విశాలమైన వేదిక; ధవళ వర్ణ అంచుతో ఎర్ర తివాచీ స్వాగతం; నేల కన్పడకుండా తెల్లటి వస్త్ర తివాచీలు; ఏ మాత్రం తికమక, గందర గోళం లేకుండా ఎవరి స్థాయికి తగిన తీరులో వారు వధూవరుల దగ్గరకు వచ్చి, వెళ్లే ద్వారాలు; వేలమంది నింపాదిగా విందార గించే వసతులు. మొత్తం ప్రాంగణ మంతా కంటి కింపైన పుష్ప తోరణాలు... ఆ కళ్యాణ వైభవం చూడడానికి వేయి కనులు చాలవనడం నిజం.

కేవలం డబ్బు ఖర్చు పెడితే వచ్చే శోభ కాదది; కళా హృదయంతో, కంప్యూటర్ తరహా మేధతో ప్రణాళిక వేసి, తీర్చి దిద్దినవవి. ఈ ఏర్పాట్లకు వెలుగు నిచ్చింది - ఆహ్వానంలోని, ఆతిథ్యంలోని ఆత్మీయత, ఆర్ద్రత.

ఎప్పుడో వాకాడులో విద్యా సంస్థల ప్రాంగణంలో సభలు, సమావేశాలు జరిపించే టప్పుడు జనార్దన రెడ్డి గారు ఏర్పాట్లలో తన కళాభిజ్ఞతను, ఆతిథ్యంలో ఆత్మీయతను ప్రదర్శించే వారు. అనాటి అతిథేయత్వ... ఆప్యాయత మళ్లీ ప్రదర్శించుకొనే అవకాశం ఇన్నాళ్లకు లభించి నట్లుం దాయనకు.

పెళ్లికి మనబోటి వారా సరా ఆహూతుల సంఖ్య వేలల్లో వుంటే; ప్రధాని పివి, గవర్నర్లు చెన్నారెడ్డి, కృష్ణకాంత్, కేంద్ర మంత్రులు, రాష్ట్ర మంత్రులు, మాజీ ముఖ్య మంత్రులు, కాంగ్రెస్ నాయకులు తదితర ముఖ్యుల సందడి జాస్తిగానే వుండింది.

* * *

శ్రీహరికోటలో బంగారం వంటి ... విద్యా వ్యాప్తి తహతహతో నెల్లూరు సెంట్రల్ స్కూలు స్థాపించి, కళాశాలగా దాన్ని విస్తరించి, వ్యాపార మెళకువలు వంట బట్టక, దరవుల పంటలో లాభాల దిగుబడి పొందలేక సతమత మౌతున్న సహృదయ మిత్రుడు, సంస్కారి శ్రీ కెఎస్ రావు తనయ డాక్టర్ సుధా భారతి ఎంబిబిఎస్; కోట, స్వర్గీయ శానాతి రాధాకృష్ణయ్య గారి కుమారుడు అనిల్ కుమార్ బి.ఇ.ల పరిణయం 21 తేది టిబిడిలో వైభవంగా జరిగింది.

కొరవ 7 పేజీలో



తనయుడి పరిణయోత్సవ తన్మయంలో జనార్ధనరెడ్డి, శ్రీమతి రాజ్యలక్ష్మి

# కొత్త షేర్లు ఇంక కొనవద్దు!




పార్లమెంట్ ఎన్నికల ముందు బలహీనంగా, అనిశ్చితంగా వుండ వలసిన షేర్ మార్కెట్ అనూహ్యంగా పైకి ఎగ బ్రాకుతున్నది. ఇన్వెస్టర్లకు సంతోషం కల్గించే విషయమే అయినప్పటికీ దీనికి కారణం ఏమిటన్నది కొంచెం జాగ్రత్తగా విశ్లేషించు కోవడం అవసరం. ఇది బలుపో లేక కృత్రిమంగా వచ్చిన వాపో అర్థం చేసుకో గల్గితే మళ్లీ బోల్తా కొట్టకుండా మనల్ని మనం కాపాడు కోవచ్చు. విదేశీ ఇన్వెస్టర్లు షేర్ మార్కెట్‌లో విస్తృతంగా వ్యాపారం ప్రారంభించడమే ఇండెక్స్ పెరుగుదలకు కారణ మన్నది అంద రెరిగిన సత్యం. అయితే విదేశీ ఇన్వెస్టర్లు మన కంటే జాగ్రత్త పరులు. వారు తొందర పడరు. చాలా సమగ్రమైన, సంపూర్ణమైన సమాచారం, విశ్లేషణ, శాస్త్రీయ పరమైన అంచనాలతోనే వారు షేర్ల లావా దేవీలు నిర్వహిస్తారు. లోకసభ ఎన్నికలు వారాల వ్యవధిలోకి వచ్చేసి, ఏ పార్టీకి మెజారిటీ రాదన్న అంచనా దినదినానికి బలపడుతున్న ఈ సమయంలో షేర్ మార్కెట్ పెరుగుదలకు కారణాలేవీ కన్పించడం లేదు.

కారణమేదైనప్పటికీ అట్టడుగుకు దిగజారి పోయి వుండిన ఇండెక్స్ 3500 పాయింట్లకు చేరుకొని, గడియారం పెండులం మాదిరి పది, పాతిక పాయింట్లు అటు, ఇటుగా వూగిస లాడుతున్నది. టివిలో షేర్ల ధరల పట్టికలు, చలన గతులు ఎప్పటి కప్పుడు వీక్షించే అవకాశం లభ్యం కావడం వల్ల దేశంలోని పందలాది నగరాలు, పట్టణాలలో షేర్ల వ్యాపారం క్రమక్రమంగా ముమ్మర మౌతున్నది. చాలా మంది సబ్ బ్రోకర్లు ఈ టివీలు ఆన్ చేసి, క్యాసినోలలోని జూదాల వలె షేర్ల ట్రేడింగ్ నిర్వహిస్తున్నారు.

ప్రస్తుత షేర్ మార్కెట్ టర్నోవర్‌లో విదేశీ ఇన్వెస్టర్ల కొనుగోళ్లు, అమ్మకాలు కేవలం 10 శాతం మాత్రమేనని చెప్పవచ్చు; తక్కిన 90 శాతం టర్నోవర్‌కు స్పెక్యులేషన్ కారణం. టర్నోవర్‌లో అధిక శాతం రిలయన్స్ కంపెనీ ఆక్రమిస్తున్నది. 1500 కోట్ల లావా దేవీ జరిగితే, అందులో రిలయన్స్ ఒక్క షేరు వాటా వెయ్యి కోట్ల వరకు వుంటున్నది.

విదేశీ ఇన్వెస్టర్లు ప్రధానంగా పవర్ కంపెనీల పట్ల ఆకర్షితు లౌతున్నారు. వారి పాత్ర, ప్రమేయం కేవలం టాటా పవర్, అహమ్మదా బాద్

కొరవ 7 పేజీలో

# ఇంక మర్యాద కాదు!

ఎన్నికలు రెండు నెలల్లో జరుగనున్న ఈ సమయంలో ప్రధాని పదవి నుంచి దిగి పొమ్మని పివి నరసింహా రావు గారిని కోరడం అపహాస్యంగా కన్పిస్తుంది. కాని నైతిక విలువల పట్ల ఏ మాత్రం పాటింపు వుండినా రెండు నెలలు కాదు - రెండు రోజుల పాటైనా అయినా పదవిని నిర్వహించడం ధర్మం కాదు.

భారత రాజకీయాలలో పివి ప్రధానిత్వంలో వచ్చినన్ని ఆరోపణలు, జరిగినన్ని కుంభ కోణాలు, వెలువడిన స్కాంలు మరెప్పుడూ తటస్థించ లేదు. హర్షద్ మెహతా షేర్ల స్కాం నుంచి, నిన్నటి ఇళ్ల కేటాయింపు గోల్మాల్ వరకు ఎన్ని అవినీతి అస్థి పంజరాలు గుట్టలు పడినాయో లెక్కలేదు. ఒక్కొక్క కుంభకోణంలో ఎన్నెని వేల కోట్ల రూపాయల ధనం స్వార్థ పరుల బొక్కసాలలోకి చేరిందో లెక్కలేదు. ప్రతి కుంభకోణం వెనుకా అధికారంలో వుంటే పెద్దల అండ, ఆశీర్వాదం, ప్రమేయం, పాత్ర వున్నట్లు సాక్ష్యాధారాలతో నిరూపిత మౌతున్నది. ఒక్క హవాలా గోల్మాల్‌లోనే సగం మంది పివి క్యాబినెట్ సభ్యుల లజ్జా రహిత అక్రమార్జన రుజువైంది. రోజుకొక్క కొత్త కేంద్ర మంత్రి పేరు వెలికి వస్తున్నది.

ఇంకొక ప్రక్క పివి క్యాబినెట్‌లోనే భాగ స్వాములైన మరొక భాగం మంత్రులు జాతి విద్రోహ, హింసాత్మక నేరాలకు పాల్పడినట్లు దర్యాప్తులో తెలుతూంది. బొంబాయి ప్రేలుళ్ల వంటి ఘోర కిరాతక కాండకు పాల్పడిన క్రిమినల్స్‌కు ప్రభుత్వ అతిథి గృహంలో రాచ మర్యాదలు చేసే స్థాయికి మంత్రులు దిగజారి పోయిన వైనం విని జాతి యావత్తూ సిగ్గుతో తలదించు కొంటున్నది.

ఈ నీచత్వం చాలదన్నట్లు ఇప్పుడు సాక్షాత్తు ప్రధాన మంత్రి పైనే హవాలా కేసులో సిబిఐ దర్యాప్తు ప్రారం భించింది. సిబిఐ అంటే ప్రధాన మంత్రి ప్రత్యక్ష పర్యవేక్షణలో వుండే ఒకానొక ప్రభుత్వ విభాగం. తమ శాఖకే కాక, ప్రభుత్వానికే అధినేత అయిన వ్యక్తి పైన దర్యాప్తు జరప వలసి రావడం కంటె సిబిఐ అధికారులకు దురదృష్ట కరమైన విషయం వేరొకటి వుండదు. ఇటువంటి పరిస్థితి మనదేశంలో ఎప్పుడూ ఎదురు కాలేదు. తమ అధినేత నేరం పై ఏ పరిశోధనా విభాగం న్యాయంగా, స్వేచ్ఛగా దర్యాప్తు జరప గల్గుతుంది?

ఎక్కడో ఏదో రైలు ప్రమాదానికి గురైతే పదవిని పరిత్యజించిన త్యాగ ధనులు, ఆదర్శ పురుషులు మనుగడ సాగించిన రాజకీయ సాంప్రదాయం మనది; ఇప్పుడు తన ప్రభుత్వంలోని సగం మంది మంత్రులు, అవినీతి పరులు, జాతి విద్రోహులు అని నిరూపితమైన తర్వాత కూడా నిక్షేపంగా, నింపాదిగా అధికార భోగం అనుభవించే పెద్ద మనుషుల రాజ్యంగా మారి పోయింది.

ఇది సహించరాని విషయం. రాజ్యాంగం ప్రకారం కేంద్ర మంత్రి వర్గం సమష్టి బాధ్యతతో పని చేసే పరిపాలనా యంత్రాంగం. అందులోని భాగస్వాముల తప్పొప్పులకు ప్రధాన మంత్రిది నైతిక బాధ్యత. అధికార దుర్వినియో గానికి, అక్రమార్జనకు, అరాచక శక్తుల ఆశ్రయానికి పాల్పడిన మంత్రుల నేరాలతో పివి గారికి ప్రత్యక్ష సంబంధం లేక పోవచ్చు; కాని వాటన్నింటికీ జాతికి సమాధానం చెప్ప వలసిన వాడు ఆయనే. కానీ ఆయన నోటి నుంచి ఒక్క మాట రావడం లేదు. పొరపాటున సైతం ఈ ప్రస్తావన తేవడం లేదు. భారత ప్రజానీకం మనస్తత్వాన్ని ఆయన అర్థం చేసుకున్నంత సమగ్రంగా మరే రాజకీయ వాదీ గ్రహించ లేదనడం అత్యుక్తి కాదు. మన ప్రజల కోపతాపాలు తాటాకు మంటలు; క్షమా గుణానికి పెట్టింది వారు పేరు; వారి జ్ఞాపక శక్తి అత్యల్పం. పంజాబ్ అరాచకాన్ని, బొంబాయి బాంబు ప్రేలుళ్లను, అయోధ్య దురంతాలను, ఇంకా అటువంటి సవాలక్ష దుర్ఘటనలను మర్చి పోయాం మనం. అవేవి జరగనట్లే ప్రవర్తిస్తున్నాం. ఈ అవినీతి, ఈ కుంభకోణాల పరిస్థితి కూడా అంతేనని ఆయన భావన. బదులు చెప్పకుంటే ప్రతిపక్షాలు కూడా ఎంతో కాలం కాకిగోల చేయలేవని ఆయన విశ్వాసం. ఆ నమ్మకంతోనే, ఆ సిద్ధాంతం ప్రకారమే ఆయన మౌన వ్రతం పాటిస్తున్నారు; మూగ భాష తన మత మన్నట్లు వ్యవహ రిస్తున్నారు. తన ప్రభుత్వంలో ఇటువంటి ఘోరాలు, నేరాలు జరిగి పోతుంటే, వాటితో తనకు నిమిత్తం లేదన్నట్లు వుండి పోగల్గడం ఎంత గొప్ప విషయం?

జమీన్‌రైతు

ప్రధాని పివి ఆదేశం మేరకు తాను 50 లక్షల రూపాయలు ఆరికె ధావన్ చేతికి అందించినట్లు జైన్ సిబిఐకి చెప్పారు. దాని అర్థం ఆ లంచం తనకిచ్చినట్లే కదా? అయినా ఆయన నిస్సిగ్గుగా ధావన్‌ను మాత్రం పదవి నుంచి తప్పించారు. తాను చూరు పట్టుక వ్రేలాడు తున్నాడు. ఎంతటి మానసిక 'పరిపక్వత' కావాలి ఇంత నిమ్మళంగా వుండ గల్గడానికి?

కాని భారతీయ ఓటర్లు ఆయనను కున్నంత అవజ్ఞులు కారు. 1977 ఎన్నికలు ఆ విషయాన్ని స్పష్టంగా నిరూపించాయి. 1989 లోనూ రాజీవ్ గాంధీకి గుణపాఠం నేర్పారు భారత ఓటరు. ప్రధాని తన తప్పు తెలుసు కోకుంటే రేపటి ఎన్నికల్లో ఆ చరిత్ర మరొక సారి పునరా వృతమౌతుంది.

పివి నరసింహా రావు గారు ఇంక ఒక్క రోజు ఆ పదవిలో వుండడం మర్యాద కాదు. అది కనీస పాటి నైతిక విలువలకు, రాజకీయ రుజువర్తనకు విరుద్ధం. తన మంత్రుల నీచ కృత్యాలకు బాధ్యత వహించే కాక, తన పై తన అధీనంలోని సిబిఐ నేర విచారణ జరుప బోతున్నందుకైనా ఆయన పదవి పరిత్య జించాలి. ఎవరెన్ని తిట్టినా, అవినీతి పరుడని నిందించినా, పరోక్షంగా సుప్రీం కోర్టు చీవాట్లు పెట్టినా, తనని కాదని తుడుచుకొని వెళ్లి పోతున్నారు; కనీసం తనను తాను ఈ రెండు నెలలు అపద్ధర్మ ప్రధానిగా ప్రకటించుకొని పరిపాలనలో స్వయం నిర్ణయాలు తీసుకోకుండా కాలం గడిపినా చాలు. ఆ మాత్రం ప్రజాస్వామిక విలువల పట్ల కూడా పరిగణన లేకుంటే - ఈ దేశంలో రాజకీయ వాదులను విష పురుగులుగా జనం ఈసడించుకొనే రోజు తొందరలోనే వస్తుంది.

---

జమీన్‌రైతు

22.2.1946

వెల: 0-1-6 పేజీలు:8

## 50 ఏళ్ళ క్రితం ఈ వారం

### నెల్లూరు ముచ్చట్లు

#### ఎలెక్షన్

అప్రీలులో నెల్లూరు డివిజన్‌కు వెన్నెలకంటి రాఘవయ్య గారిని శాసన సభ్యునిగా సెంట్రల్ బోర్డు వారు నియమించారు. తక్కిన డివిజన్‌లకు ఆంధ్ర బోర్డు వారు నిర్ణయించిన పెరుమాళ్ళు నాయుడు, గోపాలు రెడ్డి, వెంకట నారాయణ రెడ్డి గార్లనే ఆమోదించారు.

రాఘవయ్య గారి మార్పు కాంగ్రెసు వారిలో చీలికలు రాకుండా చేయడానికి ఎక్కువ ఉపక రిస్తుందను కుంటాను. రాఘవయ్య గారు ఎక్కువ కాలం నుండి కాంగ్రెసులో తీవ్రంగా పనిజేస్తున్న వ్యక్తి. వీరి నియామకానికి ఎవ్వరూ అసంతృప్తి పడనవసరం లేదు. అందరు వ్యక్తులలోను కొన్ని లోపాలు వుంటవి. అవి మానవ సహజం. కొందరిలో ఎక్కువగా మరి కొందరిలో తక్కువగా ఉండవచ్చు. అంత మాత్రమే కోదండ రామిరెడ్డి గారిని బలపరచిన పక్షం గూడా రాఘవయ్య గారి ఎన్నికలోయు భేద భావాలు లేక సంపూర్ణ సహకారంతో తీవ్రంగా పని జేస్తుందని గట్టిగా చెప్పగలము. అట్లా చేయడమే కాంగ్రెసు యొక్క నిజ తత్వానికి నిదర్శనము. వ్యక్తుల తరతమ భేదాలతో పని జేయడము కించిజ్ఞుల స్వభావము. కాంగ్రెసు సంస్థ యొక్క ఔన్నత్యాన్ని ప్రధానంగా చూడవలె గాని, వ్యక్తుల యొక్క లావు సన్నాలను పరిగణింప నక్కరలేదు.

ఒక జిల్లాలో కాంగ్రెసులో పని చేయునట్టి సర్వ సభ్యులను ఒక మాటు సమావేశ పరచి ఒకరొకరి లోనున్న భేద భావాలను సరిదిద్దుకొని కార్యక్రమానికి ఉపక్ర మింపమని కోరుచున్నాము.

నెల్లూరు డివిజన్‌లో కమ్యూనిస్టు అభ్యర్థి వున్నారు. ఈ డివిజన్‌లో అప్పటికి మనం పూచిక పుల్లంత పని చేయలేదు. ఇప్పటికైనా బ్రహ్మాండమైన కార్య కలాపాన్ని సాగించి, కమ్యూనిస్టు అభ్యర్థి యొక్క డిపాజిట్టును సైతం ఎగర గొట్టడమే మన ధర్మం. రండి, పూనుకోండి, ముందుకు నడవండి.

#### ఇక బియ్యమే

నెల్లూరులో 18 తేది నుండి రేషనింగ్ మార్చారు. క్రింది వరాలకు గోధుమ, రాగి యిస్తున్నారు. 19 తేది పెద్ద అసమ్మతి సభ జరిగింది. 21 తేది అన్ని జాతులు పని పాటలు మాని ఎ.సి. సుబ్బారెడ్డి, ఓరుగంటి గారల అధ్వర్యం క్రింద అసిస్టెంటు సివిల్ సప్లయి ఆఫీసరు వద్దకు రాయబారం నడిచింది. అందరికీ బియ్యమే యిచ్చేటట్లు తీర్మానించారు.

కొరవ 8వ పేజీలో

---

# ప్రజాస్వామ్య వ్యవస్థను న్యాయస్థానాలే రక్షించాలి!

ఇప్పటి భారతీయ న్యాయ వ్యవస్థ పని చేస్తున్న తీరును తప్పక అభినందించి తీరాలి. హవాలా కుంభకోణాలు సుప్రీం కోర్టు న్యాయ మూర్తులు వ్యవహరించిన తీరు వల్ల బట్టబయ లయ్యాయి. ఈ కేసులో నిందితులైన నాయకులు తమ కేసుల పై త్వరగా తీర్పు ఇవ్వాలని కోర్టు పై తెచ్చిన వత్తిడిని న్యాయమూర్తులు సుతి మెత్తగా తిరస్కరించారు. అదే విధంగా ఢిల్లీలో ఏళ్ల తరబడి ఇళ్లు ఖాళీ చేయని నాయకులకు వ్యతిరేకంగా ఇచ్చిన తీర్పు కూడా బాగుంది. న్యాయ వ్యవస్థ సక్రమంగా వ్యవహరించ గలిగితే ప్రజాస్వామ్య వ్యవస్థ బ్రతికి బట్ట కట్ట కలుగుతుంది.

నెల్లూరు -కె. కిరణ్ కుమార్

### నాయకులు తమ వైఖరి మార్చుకోవాలి!

1989 ఎన్నికల్లో రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీని గెలిపించిన కార్యకర్తలు తిరిగి ఐదేళ్ల వరకు ఆయా నాయకులను కనిపించలేదు. ఇప్పుడు పార్లమెంటు ఎన్నికలు రాగానే మళ్లీ కార్యకర్తలు గుర్తుకు వస్తున్నారు. రేపటి ఎన్నికల్లో ఏదో విధంగా మళ్లీ నాయకులను గెలిపించి పంపిస్తే మళ్లీ ఐదేళ్లకు కనపడతారు. అయితే ఇప్పుడు రోజులు మారాయి. నిరంతరం ప్రజలకు అందుబాటులో వుండే వారినే ఎన్నుకొంటున్నారు. కాంగ్రెస్ నాయకులు మునుపటి ధోరణి వీడి ఇప్పటి నుండైనా గ్రామీణ ప్రాంతాల్లో తిరిగి ప్రజల అవసరాలు గుర్తెరిగి పనిచేస్తే మంచిది.

గంగవరం -జి.రామకృష్ణప్రసాద్

## జనవాణి

### సినీ నటుడు రాజనాలను ఆదుకోవాలి!

అలనాటి తెలుగు సినిమాల్లో ఏకైక విలన్ రాజనాల. ఆయన పూర్తి పేరు రాజనాల కల్లయ్య. రాజనాల వారి స్వస్థలం కావలి అని చాలా మందికి తెలియక పోవచ్చు. ఆ రోజుల్లో విఠలాచార్య జానపదాల్లో కాంతారావు, రాజనాల లేని చలన చిత్రం దాదాపు లేదు. తెర పై విలన్ అయినా నిజ జీవితంలో దైవభక్తి మూర్తీ భవించిన రాజనాల గంటల తరబడి దైవ పూజ చేయనిదే ఏ కార్యక్రమమూ తల పెట్టరు. మద్రాసులోని వారి ఇల్లు ఆంధ్ర నుండి వెళ్లిన అతిథులతో కళకళ లాడుతుండేది. ఎన్టీ రామారావు, రాజనాలను మామాజీ అని ఆప్యాయంగా గౌరవంగా పిలిచే వారట. అటువంటి గొప్ప నటుడు నేడు

కొరవ 10 పేజీలో




కవిత్రయ జయంత్యుత్సవ సభల్లో డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి చేతుల మీదుగా సన్మానాలు అందుకొంటున్న స్వయంపాకుల శ్రీనివాసులు, డాక్టర్ సుమతి నరేంద్ర, డాక్టర్ పోతుకూచి సాంబశివ రావు. నిర్వాహక సంఘ సభ్యులు గోనుగొండ వెంకట సుబ్బయ్య, పి.వి. రమణా రెడ్డి, డి.వి. రమణయ్య, బి.వి. నరసింహం, కె.వి. రెడ్డి, అగస్త్యరెడ్డి వెంకురెడ్డిలను చిత్రంలో చూడవచ్చు

# ఆంధ్ర భారతంలో కవులు ముగ్గురూ ఆనాటి సామాజిక జీవనానికి అద్దం పట్టారు!

వర్తమాన సమాజం, కవిత్రయ జయంతి సంఘాల సంయుక్త నిర్వహణలో టౌన్‌హాల్‌లో 10, 11, 12 తేదీల్లో సాహిత్యోపన్యాసాలు, ప్రముఖ కవి పండితులకు సత్కారాలు జరిగాయి. 10 తేది నన్నయ జయంతి సభను ఉత్తర ప్రదేశ్ మాజీ గవర్నర్ డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డి ప్రారంభించి మాట్లాడారు. స్వర్గీయ తిక్కవరపు రామరెడ్డి కవిత్రయ జయంత్యుత్సవాలు ప్రారంభించి నిరంతరాయంగా జరిపిన రోజుల నాటి పాత సంగతులు గుర్తుకు తెచ్చారాయన. విశ్వ రచన పత్రికా సంపాదకులు డాక్టర్ పోతుకూచి సాంబశివ రావు నన్నయ భారతాం ధ్రీకరణం అనే అంశం పై విమర్శ నాత్మకమైన ప్రసంగం చేశారు. ఆంధ్ర సాహితీ సృష్టికి నన్నయ్య ఆద్యుడు; పద్య విద్యకూ ఆయనే ఆద్యుడు. ప్రయోజనం లేనిదే ఏ పదాన్నీ నన్నయ్య ప్రయోగించ లేదు. రమణీయార్థ ప్రతిపాదక శబ్ద కావ్యం అన్న సూత్రం అన్ని విధాల నన్నయ్య భారత రచనకు సరిపోతుంది. సమకాలీన ప్రజల జీవనం, ఆనాటి ఆచార వ్యవహారాలను ప్రతిబింబించే విధంగా నన్నయ్య భారత ఆంధ్రీకరణం కొనసాగింది. ప్రసన్న కథా కవితార్థ సూక్తితో నారసి మేలు అన్నట్లు - ప్రసన్న కవితా రీతులతో కథా కథనం పద్ధతికి నన్నయ్య చూపిన బాట ప్రబంధ కర్తలైన కవులందరికీ మార్గదర్శకమైన దన్నారాయన. ఆంధ్ర సారస్వత లోకంలో నన్నయ్య భారతం నాటికీ నేటికీ మణిపూసలా వెలుగొందు తున్నది. నన్నయ్యకు పూర్వమే కన్నడ భాషలో పంపడు భారతం అనువదించి నప్పటికీ వైదిక ధర్మ పునరుద్ధరణ, జన హితం కోరిన ఆంధ్ర భారతానికి దేశంలో లభించిన ఖ్యాతి ఇతర భాషలలోని భారత రచనకు దక్కలేదని చెప్పి ముగించారు.

11 తేది వర్తమాన సమాజం అధ్యక్షులు పి.వి. రమణా రెడ్డి అధ్యక్షతన తిక్కన జయంతి సభ జరిగింది. ఉస్మానియా విశ్వ విద్యాలయం తెలుగు రీడర్ శ్రీమతి సుమతి నరేంద్ర తిక్కన కవితా వైశిష్ట్యాన్ని గూర్చి చేసిన విపుల ప్రసంగం శ్రోతల ప్రశంసలు అందుకొంది. ప్రాచీన కవులకు దేశకాల పరిస్థితుల పై అవగాహన సానుభూతులు లేవనే అపనింద వుంది. శైవ, వైష్ణవ మత వైషమ్యాలతో దేశం అల్లకల్లోలంగా వున్నందు వల్లనే తిక్కన హరిహర అద్వైతం ప్రతిపాదించి ప్రజల్లో సామరస్యం శాంతి నెలకొల్పడానికి ప్రయత్నించినట్లు చెప్పారామె. శుష్కమైన వేదాంత ధోరణితో నిండిన సనత్సు జాతీయాన్ని తిక్కన ఆంధ్రీ కరించలేదు. మంత్రి పదవిని

## కవిత్రయ జయంత్యుత్సవాలు

నిర్వహించిన తిక్కన సామాజిక జీవన చిత్రణలో సాటిలేని వ్యక్తి. నిన్ను తెలిసిన వారు నన్ను గౌరవించు అన్న భావనలతో గంభీరమైన భావాలను అలవోకగా తెలుగులో ఇమడ్చ గలిగారు. శివ కవుల దేశి కవితా ఉద్యమాన్ని ఆకళింపు చేసు కొన్నందు వల్ల నన్నయ్య రచనలోని తత్సమ పద సౌందర్యం, శివ కవుల దేశి పదాల లాలిత్యం తిక్కన రచనలో అడుగడుగునా వుంటాయి. ప్రజల వాడుకలో వున్న చిన్న చిన్న వాక్యాలే పద్యాల్లో చేరి పోవడం వల్ల ప్రత్యేకత కొట్టొచ్చినట్లు కనపడు తుందన్నారు. తిక్కన భారతంలో కురు పాండవుల కథ మాత్రమే ధర్మ స్వరూపం. ఇతిహాసిక రంగం రమణీయంగా ప్రతిపాదింప బడింది. విరాట, వుద్యోగ పర్వాలు ఊర్జిత కథోపేతంగా నిలిచాయి. యుద్ధ పంచకం తర్వాత శాంతి, స్త్రీ పర్వాలలో నీరసమైన కథలో సాగినా ఆయా పర్వాలలోని పలు విషయాలు భావి భారతీయులకు ఉన్నతా దర్శాలను, మానవీయత ఉదాత్తతలను చాటి చెప్తున్నా యన్నారు.

12 తేది ఎర్రన జయంతి సభకు దుగ్గొట్టి వెంకట రమణయ్య అధ్యక్షత వహించారు. నన్నయ్య కవితలోని ప్రసన్నతను, తిక్కన రచనలోని నాటకీయతను వర్ణనా సౌందర్యాన్ని చక్కగా చేదోడు వాదోడుగా చేసుకొని ఎర్రన అరణ్య పర్వ శేష పూరణం గావించినట్లు చెప్పారు. ప్రముఖ జ్యోతిష్యులు స్వయంపాకుల శ్రీనివాసులు ఎర్రన సూక్తి వైచిత్రి విశ్లేషణం చేశారు. ప్రహ్లాద - కీచక - దుస్ససేన - ద్రౌపది - భీమాదుల పాత్ర పోషణ చిత్రణల సందర్భంలో కానవచ్చే సూక్తి వైచిత్రి విశిష్టమైన కావ్య శోభను సంతరించు కున్నదని చెప్పారు.

వుపన్యాసకులను, కవిత్రయ సంఘాధ్యక్షులు డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డి సన్మానించారు. సభలో గోనుకొండ వెంకట సుబ్బయ్య, బి.వి. నరసింహం స్వాగత కృతజ్ఞతా వాక్యాలు పలికారు. ప్రతిరోజు సభా రంభంలో నెల్లూరు ప్రభుత్వ సంగీత నాట్య కళాశాల విద్యార్థినులు భక్తి గీతాలాపన చేశారు.

ప్రజల వద్దకు పాలనా ప్రహసనం

# పేర్లు ఇప్పుడు చదువుతాం- పట్టాలు ఎప్పుడో ఒకప్పుడిస్తాం!

జిల్లాలోనే అత్యధికంగా నెల్లూరు మునిసి పాలిటీలో 31,356 మంది రేషన్ కార్డుల కోసం దరఖాస్తులు పెట్టారు. కాని వీరిలో కేవలం 10,746 మందికి మాత్రమే అర్హత వున్నట్లు రెవిన్యూ అధికారులు తేల్చారు. వీరిలో 5094 మందికి తెల్ల కార్డులు 5,652 మంది పింకు రంగు కార్డులు ఇస్తున్నట్లు 20 తేది మునిసిపల్ ఆఫీసులో జరిగిన విలేకరుల సమావేశంలో రెవిన్యూ శాఖ నుంచి వచ్చిన ఒక ఆర్‌డి స్థాయి అధికారి చెప్పారు. ఇళ్ల స్థలాలకు సంబంధించి 30, 588 దరఖాస్తులు రాగా 28 ఎకరాల ప్రభుత్వ భూమిని 2,770 మందికి; ఇతరుల నుంచి సేకరించిన భూమి 12.5 ఎకరాల భూమి 645 మంది కిస్తారని చెప్పారామె. ఈసారి ప్రజల వద్దకు పాలనలో పట్టాలకు ఎంపిక చేసిన వారి పేర్లు చదివి సరిపెట్టు కొంటారట. ఆ తర్వాత భూసేకరణ జరిపి ఎప్పుడో ఒకప్పుడు పట్టాలిస్తారట బాగుంది సంబడం! 4,224 మంది పించన్లు అడిగితే 422 మందికి; వ్యవసాయ కూలీలకు వృద్ధాప్య పించన్లు 413 మందికి, 120 మందికి వితంతు పించన్లకు సిఫార్సు చేసారట.

## నెల్లూరు సంగతులు

### రామకృష్ణ పరమహంస జయంతి సభ

నెల్లూరు వర్తమాన సమాజం యాజమాన్యాన 20 తేది టౌన్‌హాల్‌లో రామకృష్ణ పరమహంస జయంతి సభ జరిగింది. ప్రముఖ న్యాయవాది పి.వి. రమణా రెడ్డి అధ్యక్షో పన్యాసం చేసారు. శ్రీ రామకృష్ణ పరమ హంస సర్వ మానవ సమానత్వాన్ని ఎలుగెత్తి చాటారు. వేద కాలంలోనే భారత దేశంలో విశ్వ కుటుంబ భావన వుండేది. క్రమంగా మతాలు, జాతులు, కులాల పేర్లతో భారతీయులతో వైషమ్యం వెర్రి తలలు వేసినట్లు చెప్పారు. భారతీయుల జీవనం అన్ని రంగాల్లో తిరోగమనం చెందిన సందర్భంలో కాళీ మాత ఉపాసకునిగా లోక గురువుగా రామకృష్ణ పరమ హంస సర్వ మతాల వారు భగవంతుని దర్శించ డానికి మార్గం చూపినట్లు చెప్పారు. వక్తగా వచ్చిన గూడూరు డివైన్ లైఫ్ సొసైటి శాఖాధ్యక్షుడు చదలవాడ వెంకట శేషయ్య మాట్లాడుతూ ఇసుక తిన్నెల పై పాద ముద్రలు వేసి వెళ్లి పోతారు మహాను భావులు. తరువాత తరాల వారు ఆ మార్గాన్ని అనుసరిస్తే ప్రజల జీవితాలు ధన్య మవుతా యన్నారు.

కొరవ 11 పేజీలో

# సణుగుడు

## ఎమ్మెల్యేలంటేనే ఏహ్య భావం

రాజ్యసభ ఎన్నికలలో క్రాస్ ఓటింగులు, నోట్ల పంపకాలు, లోపాయి కారీ ఒప్పందాలు జరిగిన తీరు వింటుంటే అసహ్య మేస్తున్నది. రాజకీయ విలువల పతనానికి అడుగు అంచు అన్నదే లేకుండా పోతున్న దేమిటన్న ఆవేదన రగులు తున్నది.

సాదా జనం ఓట్ల పండగ సమయంలో పదో, పాతికో ఈనాం లాగా అడిగితే రాజకీయాలు పాడై పోతున్నాయని గగ్గోలు పెట్టడం అలవాటు మనకు. ఈ విషయంలో నాయకులు కూడా జనాన్ని చాలా

### డోలేంద్ర

పలకనగా మాట్లాడే స్తుంటారు. కాని ఇంత బహిరంగంగా ఓటుకు రేటు పెట్టి, లక్షలు బొక్కుతున్న శాసన సభ్యులను జనం ఎంతగా ఈసడించు కోవాలి? వారిని రాజకీయ వాదులు గానే కాదు - కనీసం సాటి మనుషులుగా గుర్తించడం, గౌరవించడం అవసరమా? కాంగ్రెస్ తరపున స్వతంత్రుడుగా పోటీ చేసిన

కొరవ 7 పేజీలో

# మార్చి నుంచి కొత్త వారికీ రేషన్ బియ్యం

## కలెక్టర్ హామీ

మూడవ విడతగా జిల్లాలో నిర్వహిస్తున్న ప్రజల వద్దకు పాలన కార్యక్రమంలో కొత్త రేషన్ కార్డులు ఇచ్చే వారికి మార్చి 1 తేది నుండి సరకులు పంపిణీ చేస్తామని జిల్లా కలెక్టర్ డాక్టర్ సాంబశివ రావు భరోసా ఇచ్చారు. 21 తేది కలెక్టరేట్‌లోని తన ఛాంబర్‌లో విలేకరులతో మాట్లాడా రాయన. జిల్లాలో 87,478 మందికి కొత్తగా కార్డులు ఇవ్వనున్నారట. ఇందులో 68, 463 పచ్చ కార్డులు, 19, 015 గులాబి కార్డులు పంపిణీకి రెడీ చేసినట్లు చెప్పారు. ఈ సందర్భంగా జరిపిన విచారణలో 10 వేల బోగస్ కార్డులు కూడా పట్టుకొన్నారట. కొత్త కార్డుల కోసం దరఖాస్తు చేసిన వాళ్లు నోడల్ అధికారులను కలసి వారి ఫోటోలు అందించి కార్డులు పొంద వచ్చని కలెక్టర్ సలహా యిచ్చారు.

ప్రజల వద్దకు పాలన సందర్భంగా వచ్చిన అర్జీలలో అర్హులైన వారికి పంపిణీ చేయను 2,350 ఎకరాల వ్యవసాయ భూమి సిద్ధంగా వుందని, 10, 838 నివేశన పట్టాలు ఇచ్చేందుకు కూడా భూమి రెడీగా వుందని చెప్పారు. జిల్లాలో అటవీ ప్రాంతాన్ని అభివృద్ధి చేసేందుకు గాను వన సంరక్షణ పథకం క్రింద 50 వేల హెక్టార్ల భూమి గుర్తించినట్లు కలెక్టరు వివరించారు.

# కావలి దేముళ్ళ భూములు గుటకాయస్వాహా!

కావలిలో వున్న దేవాలయ భూములన్నీ అన్యాక్రాంతమై పోయి ఆక్రమణ దారులు లక్షల రూపాయలకు వాటిని అమ్ముకుంటున్నా పట్టించుకొనే నాధుడే కన్పించడం లేదు. కలుగోళమ్మ, పోలేరమ్మ, విష్ణాలయం భూములు ఎవారో అన్యాక్రాంతమై పోగా చాలాగా పాతపూరులోని శివాలయం భూమిని అమ్మకానికి పెట్టినట్లు తెలుస్తోంది.

పాతవూరు శివాలయం భూములను వంశపారం పర్యంగా పూజారులు అనుభవిస్తున్నారు. దేవాలయ సమీపంలోని 100 అంకణాల దేవుని భూమిని గుడి పూజారి తన పేరు మీద ఇటీవలే రిజిష్టరు చేయించుకున్నట్లు తెలిసింది. ఈ భూమి విలువ 3 లక్షల వరకు వుంటుంది. శివ భక్తుడైన కావలి ఎమ్మెల్యే యానాది రెడ్డి గారు గుడి పూజారికి దక్షిణగా ఈ భూమిని అచ్చారేమోనని పలువురు భావిస్తున్నారు. పూజారి ఈ భూమిని యింత ప్లాట్లుగా చేసి అమ్మే ప్రయత్నంలో నిమగ్నమై వున్నారు.

దాదాపు అయిదెకరాలు వున్న కలుగోళమ్మ శాంభవి దేవాలయ భూమి నేడు లక్షల విలువ చేస్తున్నది. ఈ స్థలాన్ని టౌన్‌లో బలమున్న వారు ఆక్రమించేసి షాపులు, సినిమా థియేటర్లు కట్టి వున్నారు. ఈ సెంటర్‌లో వున్న రెండు థియేటర్లు కలుగోళమ్మ దేవస్థానానికి సంబంధించిన భూముల్లోనే వున్నాయి. యింకో థియేటర్ నిర్మాణంలో వుంది. అదే విధంగా లత థియేటర్ ఎదురుగా వున్న పోలేరమ్మ గుడికి సంబంధించిన స్థలాన్ని స్థానిక వ్యక్తి ఒకరు ఆక్రమణ చేసుకుని షాపులు కట్టి కట్టిపారు. కొందరు భక్తులు కోర్టులో పిటీషన్ వేశారు. ఆ కేసు ప్రస్తుతం నత్తనడకన సాగుతోంది. ఈ స్థలాన్ని ఆక్రమించిన వ్యక్తి తాను బి.ఎస్.పి. పార్టీ నాయకుడినని బెదిరిస్తున్నాడట.

**జిల్లావార్తలు**

విష్ణాలయం పరిస్థితి మరీ అధ్వాన్నంగా వుంది. గుడి ఆదాయాన్ని లోం చేయడమే పనిగా పెట్టుకున్న పెద్దలు కనీసం గుడి వైపు కన్నెత్తి కూడా చూడరనేది ఎంత వాస్తవమో, ఈ గుడికి వారే సతతం ట్రస్టీలుగా వుండడమూ అంతే వాస్తవం. కావలిలో పురాతనమైన ఈ దేవాలయానికి కనీసం సున్నం కొట్టి ఎన్నో సంవత్సరాలయ్యింది. దేవాలయ ధ్వజ స్తంభం తుఫానుకు పడిపోయి పది సంవత్సరాల పైనే అయింది. కావలి ఎమ్మెల్యే యానాది రెడ్డి దేవాదాయ

కొరవ 8 పేజీలో

నెల్లూరు సెంట్రల్ స్కూల్ అధినేత కె.ఎస్. రావు కుమార్తె సుధా భారతి, అనిల్ కుమార్‌ల వివాహం 21 తేది నెల్లూరు టి.టి.డి.లో జరిగింది.

# జూదరుల స్వర్గం అనంతసాగరం జాతర

శివరాత్రి సందర్భంగా అనంత సాగరం మండలం చిలకల మర్రి, కామిరెడ్డి పాడు గ్రామాల్లో శివరాత్రి జాగరణ జాతర జరుగుతుంది. గతంలో జాతరను చూసిన వారు మళ్లీ మళ్లీ వచ్చేటట్లుగా ఉత్సవం జరిగేది. కాని కొన్ని సంవత్సరాల నుండి జాతరలో అన్ని రకాల వ్యసన పరులూ వీర విహారం చేస్తూండడంతో భక్తుల సంఖ్య తగ్గి జూదం ఆడేవాళ్ళ సంఖ్య పెరిగి పోయింది. ఈ జాతరకు జూదం ఆడటానికి ఇతర జిల్లాల నుండి జూదరులు వస్తున్నారు. ఈ సంవత్సరం జాతరలో సుమారు 5 లక్షల ఆట జరిగింది. జాతరలో జూదం ఆడినందుకు పోలీసులు మధ్య వర్తులను పెట్టి మామూళ్ల వసూలు చేశారు.

## ఉగాది కథల పోటీ

శ్రీధాతు నామ సంవత్సర ఉగాదిని పురస్కరించుకొని శ్రీహరికోటలోని షార్‌వాణి సాహితీ సమాఖ్య కథల పోటీని నిర్వహిస్తున్నది. ప్రచురణ కాని, పరిశీలనలో లేని, స్వీయ రచనలకు పోటీలకు పంపవచ్చు. ప్రథమ, ద్వితీయ, తృతీయ బహుమతులు ఇస్తారు. ఎంట్రీలను మార్చి 5 తేదిలోగా జగన్ మిత్ర, కన్వీనర్, షార్‌వాణి, సి2-56, పులికాట్ నగర్, సూళ్లూరు పేట - 524 121 అడ్రసుకు పంపాలని సంస్థ అధ్యక్షుడు పాలాని సోమరాజు కోరుతున్నారు.

## బుచ్చి పోలీసుల ఘనత

తనకు న్యాయం చేయమని విన్నవించు కోవడానికి పోలీసు స్టేషను వెళ్లిన ఫిర్యాదిని చావబాది బుచ్చిరెడ్డి పాళెం పోలీసులు తమ ఘనతను చాటుకొన్నారు. దామర మడుగు పల్లిపాళెం నివాసి కనుపర్తి వనయ్యకు పొలానికి వెళ్లే బాట విషయంలో అదే గ్రామానికి చెందిన పాక శంకరయ్యకు మధ్య ఘర్షణ జరిగింది. ఈ ఘర్షణలో శంకరయ్య తనను కొట్టాడని వనయ్య పోలీసులకు ఫిర్యాదు చేసారు. పోలీసులు శంకరయ్యను స్టేషనుకు రప్పించారు. తరువాత ఏమి మంతనాలు జరిగాయో తెలియదు కాని ఫిర్యాది అయిన వనయ్యను పోలీసులు చితక బాదారు. వనయ్య సిపిఎం కార్యకర్త అట.

తమ పార్టీ కార్యకర్తను కొట్టాడనే కోపంతో సిపిఎం వారు బుచ్చిలో 18 తేది పోలీసుల జులుం నశించాలని ప్రదర్శన చేశారు.

ఈ సంఘటన అనంతరం పోలీసులు శంకరయ్య, వనయ్యలు ఇరువురి పైనా కేసులు పెట్టి విచారణ జరుపు తున్నట్లు తెలిసింది.

# విస్కీ సీసా చీప్‌గా కావాలా- గూడూరు పోలీసులనడగండి!

కంచే చేను మేసిన చందాన అక్రమ మద్య రవాణాను అరికట్ట వలసిన పోలీసులే మద్యాన్ని పద్దిగ్గా అమ్ముతున్నారు. లాభసాటైన ఈ వ్యాపారాన్ని గూడూరు రైల్వే పోలీసులు ఇటీవలే చేపట్టారు. మందు బాబులు రైల్వే స్టేషన్ వరకు నడచి వచ్చి నానా హైరానా పడత మెందుకని వాళ్లే స్వయంగా ఇళ్లకు మద్యం బాటిళ్లను చేర్చి వస్తున్నారు. ఎక్సైజ్ పోలీసుల దాడులు ఎక్కువ కావడంతో ఇంతకు మునుపు గూడూరులో ఒక ఫుల్ బాటిల మద్యం ధర 300 రూపాయలు పలికేది. ఇపుడు రైల్వే పోలీసుల పుణ్యాన 200 రూపాయలకే బాటిల్ దొరుకుతుంది. దీన్ని బట్టి అర్థం చేసుకోవచ్చు ఆ వ్యాపారం తీరు. జోరు! రైల్వే పోలీసులు మద్రాసు నుంచి వచ్చే అక్రమ మద్యం రవాణా దారులతో ఒప్పందాలు కుదుర్చుకొని వాళ్లు తెచ్చిన మద్యాన్ని దాచే కొముగోలు చేసి ఈ కొత్త వ్యాపారానికి మొదలెట్టారు. ఈ వ్యాపారం ఎక్సైజ్ పోలీసులు అడ్డు రాకుండా, రైల్వే పోలీసులు వారితో ఘర్షణ పడి తమ పరిధిలోని స్టేషన్‌లోకి వస్తే ఊరుకోమని హెచ్చరించడంతో ఎక్సైజ్ వాళ్లు కూడా మిన్నకుండి పోతున్నారు. దీనితో గూడూరు రైల్వే పోలీసుల దొంగ మద్యం వ్యాపారానికి అడ్డు అపూ లేకుండా పోతున్నది.

ఆర్.ఎం.ఎస్. వుద్యోగి శ్రీహరి రావు కుమారుడు శివరామచంద్రప్రసాద్, గాయత్రిల వివాహం 11 తేది నెల్లూరు ప్రత్తివారి సత్రంలో జరిగింది.

## అక్రమ కనెక్షన్ల పై గూడూరు కౌన్సిల్‌లో రగడ

గూడూరు మునిసిపల్ కౌన్సిల్ సాధారణ సమావేశం 19 తేది సాయంత్రం ఛైర్మన్ పి. సునీల్ కుమార్ అధ్యక్షతన జరిగింది. అక్రమ కొళాయి కనెక్షన్ల పై సమావేశంలో రగడ రేగింది. 1వ వార్డు కౌన్సిలర్ పి. సుబ్రహ్మణ్యం మాట్లాడుతూ గత సమావేశంలోనే అక్రమ కొళాయిలు తొలగిస్తామని చెప్పిన ఛైర్మన్ తన మాట నిలబెట్టు కోలేదని నిలదీశారు. దీనితో యువకుడైన ఛైర్మన్ సునీల్ కుమార్ ఆవేశ పడిపోతూ అక్రమ కనెక్షన్లు ఎక్కడున్నాయో చూపితే సమావేశం ఆపి వాటిని పరిశీలించను తాను అక్కడికి వస్తా నన్నారు. పలువురు కౌన్సిలర్లు ఛైర్మన్‌ను ఆవేశ పడవద్దంటూ సలహా చెప్పి అక్రమ కనెక్షన్ల కనుక్కొ నేందుకు కౌన్సిల్‌లోని సభ్యులతో కమిటీని వేయాలని సూచించారు. 27వార్డు కౌన్సిలర్ శీలం కిరణ్ కుమార్ ఈ చర్చను కొనసాగ దిస్తూ మునిసిపల్ సిబ్బంది, కొందరు కౌన్సిలర్లు వేయించిన దొంగ కొళాయిల లిస్టంటూ కొన్ని నెంబర్లు చదివారు. మునిసిపల్ అధికారాన్ని కొన్నాళ్లు తమ చేతికందిస్తే దొంగ కనెక్షన్లు పని పడతామని కాంగ్రెస్ కౌన్సిలర్ కోసూరు రాజగోపాల్ ఛైర్మన్‌కు సవాల్ విసిరారు. దీనితో మళ్లీ మరోసారి ఛైర్మన్ ఆవేశపడి పోయారు.

## కల్లు త్రాగి కన్న తండ్రి తల పగులగొట్టాడు

కల్లు త్రాగి, కల్లు మూసుకు పోయి కన్న తండ్రి తలనే పగుల గొట్టిన తనయుని ఉదంతమిది. ఈ సంఘటన బుచ్చి మండలంలోని రేబాల గ్రామంలో జరిగింది. చిన్నయ్య అనే యువకుడు 18 తేది కల్లును కడుపారా త్రాగి ఇంటికి వచ్చాడు. తండ్రి నారయ్య కొడుకును ఆ స్థితిలో చూసి కల్లు త్రాగి కుటుంబాన్ని కష్టాల పాలు చేయవద్దు అని మంచి మాటలు చెప్పాడు. నిషాలో ఆ మాటలు తలకెక్కని చిన్నయ్య తండ్రి పై చిందులు తొక్కి, అంతటితో ఆగక ప్రక్కనే వున్న ఇనుప రాడ్డుతో తండ్రి తల పై బాదాడు. ఇంకేముంది నారయ్య ఆసుపత్రికి, విషయం పోలీసు స్టేషనుకు చేరింది. పోలీసులు కేసును దర్యాప్తు చేస్తున్నారు.

# నెల్లూరు నలుచెరుగుల్లో విహంగ వీక్షకుడు

## జనార్దనరెడ్డి

మాజీ ముఖ్యమంత్రి, రాష్ట్ర కాంగ్రెస్ నాయకుడు శ్రీ నేదురుమల్లి జనార్దన రెడ్డి 27 తేది ఉదయం తిరుపతి మీదుగా నెల్లూరు వస్తున్నారు. సాయంత్రం వాకాడు - కొత్త కోడలి గృహ ప్రవేశోత్సవం. 28 తేది ఉదయం నెల్లూరు - వరిగలి జానకి రామిరెడ్డి పెళ్లికి అటెండెన్స్; ఆ రోజు మధ్యాహ్నం కోటలో కోడవలూరు సుబ్బారెడ్డి తండ్రి మరణం విచారింపు; 29 తేది తిరుమల వెంకన్న సేవింపు; 1 తేది మధ్యాహ్నం వాకాడు. పాపిరెడ్డి పాళెం; 2 తేది వాకాడు. తర్వాత కార్యక్రమం ఇంకా ఖరారు కాలేదు.

## రమేష్‌రెడ్డి

మార్కెటింగ్ మంత్రి శ్రీ తాళ్లపాక రమేష్ రెడ్డి 21 తేది నెల్లూరు వచ్చారు. 27 తేది వరకు ప్రజల వద్దకు పాలన కార్యక్రమాలలో పాల్గొంటారు. 28 తేది తిరుగు రైలెక్కుతారు.

## పాపం మేగోరె!

ఎంతటి వాడికీ ఖర్మ సంచితం తప్పించు కోవడం తరం కాదంటారు - మేగోరె విషయంలో అదే జరిగింది పాపం!

జిల్లా పరిషత్ ఛైర్మన్‌గా, జిల్లా రాజకీయాలలో మేధావిగా, బలగం వంటి నాయకులకు ముఖ్యుడుగా ఒకప్పుడు ఒక వెలుగు వెలిగి, ఆ తర్వాత పడక కుర్చీలో కూర్చొనే రాజకీయ మంత్రాంగం నెరపుతూ, జిల్లా రాజకీయాలలో శకుని మామ పాత్రను బహు నేర్పుగా పోషిస్తున్న మేనకూరు గోపాల కృష్ణా రెడ్డి గారు - ఈ పెద్ద వయస్సులో చిన్న కేసులో చిక్కుకొని కోర్టు శిక్షకు గురైనారు. బుజబుజ నెల్లూరులో ఇళ్ల ప్లాట్లు అమ్ముతానని నమ్మ బలికి, డాక్టర్ ఇందిరమ్మ, డాక్టర్ రామచంద్రా రెడ్డి దంపతుల దగ్గర 15 వేలు అడ్వాన్సు తీసుకొని వారికి స్థలమూ ఇవ్వక, డబ్బూ వాపసు చేయక సతాయించి నందుకు నెల్లూరు జిల్లా వినియోగ దారుల ఫోరం ఆయన్ను అభిశం సించింది. ఆ 15 వేలూ 18 శాతం వడ్డీతో సహా తిరిగి చెల్లించాలని తీర్పు చెప్పారు న్యాయమూర్తి శ్రీ కె. సిద్దారెడ్డి.

అంత ఘనంగా బ్రతికిన ఆయన గంత చిన్న మొత్తానికి మోసగాడని ఎందుకు కన్పించు కొన్నాడో తెలియదు మరి! ఈ వయస్సులో సైన పడవలసిన అపకీర్తి కాదిది ఏ పాపానికో భగవంతుడీ రూపంలో పరిహారం తీసుకు న్నట్లున్నాడు.

## జెసి బదలీ - నిజాయితీకి బహుమానం!

నెల్లూరు జాయింట్ కలెక్టర్ శ్రీ ఎ. గిరిధర్‌ను ఆర్థిక ప్రణాళిక శాఖ డిప్యూటీ కార్యదర్శిగా సెక్రెటేరియట్‌కు బదలీ చేశారు.

గిరిధర్ నెల్లూరులో వున్నది కేవలం ఏడు నెలలే. కాని ఈ కొద్ది కాలంలోనే తన సమర్థత, విధి నిర్వహణ పట్ల నిబద్ధత, నిజాయితీల ద్వారా జిల్లాలో గౌరవం అందు కున్నారాయన. కాలేజి లెక్చరర్ల ట్యూషన్ల వ్యాపారం పై గిరిధర్ నిర్వహించిన ఉద్యమం రాష్ట్ర వ్యాప్త గుర్తింపు పొందింది. ఎన్ని ఒత్తిడులు వచ్చినా, కోర్టు చీవాట్లు పెట్టినా, విద్యార్థులే ఎదురు తిరిగి ఆందోళన చేసినా చలించ కుండా పట్టుబట్టి ట్యూషన్ల పై సమరం చేశారు. తానున్నన్ని రోజులూ ఒక్క లెక్చరరు ఆ సాహసం చేయకుండా నిలువ రించారు. ప్రజల వద్దకు పాలన, శ్రమదానం కార్యక్రమాల నిర్వహణలోనూ గిరిధర్ అందరి మెప్పు పొందారు.

కాని తెలుగు ఎమ్మెల్యేలకు మాత్రం ఆయన తత్వం సరిపడలేదు. ప్రభుత్వ యంత్రాంగం చేత పచ్చ చొక్కాలకు దాస్యం చేయించ డానికి వారు చేసే ప్రయత్నాలను అడ్డు కోవడంతో బదలీ తప్పలేదు; నిజాయితీ పరులైన అధికారులకు తెలుగు ప్రభుత్వ మిచ్చే బహుమానం ఇదే!

గిరిధర్ వంటి అధికారులకు బదలీలు ఎప్పుడూ శిక్ష కాబోవు. వారి నిజాయితీకి అవి సత్కారాలుగా భావించాలి. ఆయన తన నిజాయితీ, నిర్భీకత, నిబద్ధతతలను పదిలంగా కాపాడు కోగల్గితే రాజకీయ వాదులు తిరస్క రించినా, ప్రజలు ఆదరిస్తారు.

## టెలిఫోన్ సలహా సంఘంలో వనమాలి

నెల్లూరు జిల్లా టెలిఫోన్ సలహా సంఘంలో సభ్యుడుగా జమీన్ రైతు మేనేజర్ శ్రీ తూపిలి వనమాలిని నియమించారు. రెండేళ్ల కాల పరిమితి కలిగిన నియామకం ఇది. తాళ్లపూడి మాజీ పార్లమెంట్ శ్రీ వేణుంబాక వెంకట శేషాద్రి రెడ్డి, యూత్ కాంగ్రెస్ మహిళా యుద్దికలను సభ్యులుగా నియమించారు.

వారికి మా అభినందనలు.

## డిసిసి ఇఫ్తార్

డిసిసి అధ్యక్షుడు శ్రీ ఆనం సంజీవ రెడ్డి రంజాన్ పండుగ సందర్భంగా 18 తేది విఆర్ కాలేజిలో ఇఫ్తార్ విందు చేశారు. సంజీవ రెడ్డి గారికి అలవాటు లేని పని ఇది. ముస్లింలు, జిల్లా కాంగ్రెస్ నాయకులు పెద్ద సంఖ్యలో బిరియాని భోంచేశారు.

## ఇక బాబు ప్రభుత్వాన్ని విమర్శించలేరు!

తమ ప్రభుత్వం చేపట్టిన ప్రజల వద్దకు పాలన కార్యక్రమం పై ఇక మీదట ఎవరూ విమర్శలు చేయలేరని మార్కెటింగ్ శాఖ మంత్రి టి. రమేష్ రెడ్డి ధీమాగా చెప్పారు. 23 తేది విలేకరులతో మాట్లాడుతూ చంద్రబాబు నాయుడు ప్రభుత్వమూ అధికారం లోకి వచ్చి ఐదు నెలలే అయినా, ఇప్పటి వరకు ఏ ప్రభుత్వం పరిష్కరించ లేనన్ని ప్రజా సమస్యలు పరిష్క రించింది. గతంలో ఏ ప్రభుత్వం ఇవ్వనన్ని రేషన్ కార్డులు, ఇంటి నివేశన పట్టాలు, పింఛన్లు మంజూరు చేసిందన్నా రాయన. కార్డులు ఇచ్చే సమయంలో ఫ్లాయిలతో సంబంధం లేకుండా అందరు ప్రజా ప్రతినిధులు పాల్గొనేలా చర్యలు తీసుకోమని అధికారులకు ఆదేశాలు ఇచ్చినట్లు చెప్పారు. 22 తేదిన జరిగిన ప్రజల వద్దకు పాలన కార్యక్రమంలో వెంకటేశ్వర పురం పేద్ద తనను ఎవరూ నిలదీయ లేదని వివరణ ఇస్తూ, కొన్ని పత్రికలు పనిగట్టుకొని తన పై పరుష పదజాలంతో వార్తలు వ్రాయడం పట్ల మంత్రి ఆవేదన వ్యక్త పరిచారు. ఐదేళ్లు మునిసిపల్ ఛైర్మన్‌గా వుండి ఆ తర్వాత ఎమ్మెల్యే, ఆ తరువాత మంత్రినయ్యాను. కాని అద్దె ఇంటిలోనే నివసిస్తున్నాను. నా నిజాయితీ నీకు తెలియదా అని మంత్రి పదేపదే గుర్తు చేసుకొన్నారు.

## కిడ్నాప్ యత్నం విఫలం

పాత కక్షల మూలంగా ఒక విద్యార్థినిని కిడ్నాప్ చేయాలన్న యత్నం ప్రజల ప్రతిఘటనతో విఫల మైంది. నారాయణ రెడ్డి పేటకు చెందిన రిటైర్డ్ టీచర్ బండి తిరుపాలకు అతని ఇంటి ముందున్న వాకిలి భూమి విషయమై గత కొన్ని రోజులుగా గొడవ లున్నాయి. తిరుపాల్ కుమార్తె రాజ్యలక్ష్మి పాత పెద్దాస్పత్రి రోడ్డులో గల గవర్నమెంటు మోడల్ స్కూలులో పదవ తరగతి

కొరవ 7 పేజీలో

## నెల్లూరు యువకుడికి రిపబ్లిక్‌డే గౌరవం

నెల్లూరుకు చెందిన పల్లికొండ శశి కుమార్ అనే యువకుడు ఢిల్లీలో రిపబ్లిక్‌డే పెరేడ్ ఉత్సవాన్ని ప్రధాన మంత్రి సరసన కూర్చొని వీక్షించే అరుదైన గౌరవం సంపా దించారు.

హైస్కూలు నుంచి విశ్వ విద్యాలయం వరకు చదువుల్లో ప్రతిభా వంతంగా మసలి నందుకు గుర్తింపుగా కేంద్ర ప్రభుత్వం ఆ యువకుడ్ని ఢిల్లీకి పిలిపించి, ఈ అవకాశం కల్పించింది. శశి కుమార్ విఆర్ కాలేజిలో బిఎ చదివి, విశ్వవిద్యాలయ స్థాయిలో 5 ర్యాంకు సాధించాడు. కాలేజి ఫస్ట్ కూడా! హైదరాబాదు సెంట్రల్ విశ్వ విద్యాలయంలో ఎంఎస్‌సిలో గోల్డ్ మెడల్ సాధించాడు.

ఆ యువకుడికి మా అభినందనలు.

# సింహగర్జన ప్రకంపనాలతో వణికి పోతున్న చంద్రబాబు!

విజయవాడలో ఎన్టీఆర్ వర్గం నిర్వహించిన సింహ గర్జన ఊహించని విధంగా విజయ వంతం కావటంతో రాష్ట్ర రాజకీయాల్లో ఆ వర్గం తృతీయ శక్తిగా క్రియాశీలక పాత్ర నిర్వహించడం ఖాయమని పిస్తోంది. ఎన్టీఆర్ మరణం తర్వాత ఆ వర్గం ఉనికి ప్రశ్నార్థకంగా తయారైంది. అయితే సింహ గర్జన సదస్సుతో ఎన్టీఆర్ వర్గం ఉనికి పట్ల గల సందేహాలన్నీ పటా పంచలయ్యాయి. ఎన్టీఆర్ లేకుండా జరిగిన సింహ గర్జనకు కృష్ణా తీరం ఈనిందా అన్నట్లు లక్షలాది జనం హాజరయ్యారు. అన్ని రాజకీయ సభలకు మాదిరిగానే సింహ గర్జనకు కూడా జనాన్ని తోలినప్పటికీ అంతకంటే మించి జనం స్వచ్ఛందంగా సభకు తరలి రావడం విశేషం. వచ్చిన వారు కూడా ఏదో మొక్కుబడిగా రాలేదు. తమ అభిమాన నటుడికి జరిగిన అన్యాయానికి స్పందించి వచ్చిన వారు కొందరైతే, తమ రాజకీయ అధినాయకుడి పట్ల జరిగిన వెన్నుపోటు (అ) రాజకీయానికి కన్నెర్ర చేసి వచ్చిన వారు మరికొందరు. మొత్తం మీద సభకు వచ్చిన జనం ఒక లక్ష్యం కోసం వచ్చినట్లుగానే కనబడ్డారు. చంద్రబాబు నాయుడ్ని గద్దె దింపటమే లక్ష్యమని లక్ష్మి పార్వతి తన ప్రసంగంలో అన్నప్పుడు కృష్ణా తీరమంతా హర్ష ధ్వానాలతో మార్మోగింది. బహుశా ఆ నిరసన ధ్వనులు హైదరాబాదులోని జూబ్లీ హిల్స్‌లో వున్న ముఖ్య మంత్రి నివాసం దాకా వినిపించాయేమో. ముఖ్య మంత్రి కూడా గర్జనకు కలవర పడినట్లు కనిపిస్తున్నారు. వచ్చే లోక్‌సభ ఎన్నికల్లో కూడా ఇదే విధమైన స్పందన వుంటే దాని ప్రభావం తన పై పడక తప్పదని బాబు భావిస్తున్నాడు. అందుకే లోక్‌సభ ఎన్నికల నాటికి ఎన్టీఆర్ వర్గంలోని ఎమ్మెల్యే లందర్నీ తన పక్కకు లాగేసుకొని డాక్టర్ దగ్గుబాటిని ఒంటరి పక్షులా చేయాలన్నది బాబు ప్రయత్నం. ఎమ్మెల్యేలు వున్నా లేకున్నా జనం తమ పక్షానే వున్నారని పార్వతి, దగ్గుబాటి

> **కాంగ్రెస్ మాత్రం మహా ఆనందంగా వీక్షిస్తూంది!**

పాడుతున్న యుగళ గీతంలో ఆత్మ విశ్వాసం వ్యక్త మవుతోంది. కాగా సింహ గర్జన స్పందనకు ఎన్టీఆర్ వర్గం కంటె కాంగ్రెస్ నాయకులకు మహా దానందంగా వుంది. ఎన్టీఆర్ వర్గం ఉనికి కోల్పోతే బాబు బలపడ్తాడు. అప్పుడు ముఖాముఖి పోటీ వుంటుంది. ముఖాముఖి పోటీ జరిగితే కాంగ్రెస్‌కు నష్టం, బాబుకు లాభం కలుగు తుందన్నది కాంగ్రెస్ వారి అంచనాలు. కాగా లక్ష్మిపార్వతి ఇప్పుడు తృతీయ శక్తిగా సాక్షాత్క రించటంతో ముక్కోణపు పోటీ తప్పదు. ఇదే జరిగితే తెలుగు దేశం ఓట్లుచీలి కాంగ్రెస్‌కు లాభిస్తుందనే కాంగీయుల ఆశ. అందుకే ఎన్టీఆర్ వర్గం లక్ష్మిపార్వతి రాష్ట్ర రాజకీయాల్లో పది కాలాలు వుండాలని ఇప్పుడు కాంగీయులు చేతులెత్తి దేవుడ్ని ప్రార్థిస్తున్నారు. తద్వారా బాబును అశక్తుడ్ని చేయ వచ్చున్నది కాంగీయుల ధీమా. సింహ గర్జన సదస్సుతో తన వర్గంలో రేగిన కలకలాన్ని దూరం చేసేందుకు, జనం తన వైపునే వున్నారని చాటి చెప్పేందుకు చంద్రబాబు మార్చి నెలలో విజయ వాడలోనే పోటీ సభ పెట్టాలని నిర్ణయించారు. అధికారం వుంది కాబట్టి సింహ గర్జనకు రెండింతల జనాన్ని కృష్ణా తీరానికి తోలాలని బాబు పథకం రూపొంది స్తున్నారు. ఈ సభకు మిత్రులతో పాటు జాతీయ ప్రతిపక్షీయుల్ని పిలిచి కేంద్ర ప్రభుత్వం పై విరుచుకు పడి తద్వారా కాంగ్రెస్ వ్యతిరేకిగా జనంలో ముద్ర వేయించు కోవాలన్నది బాబు అభిమతం.



డాక్టర్ సిఆర్ రెడ్డి తనయ సునీత, వంశీధర్ రెడ్డి; వీరి వివాహం 11 తేదీ నెల్లూరులో జరిగింది.

## పెండ్లిండ్లు

2 పేజీ తరువాయి

* * *

...తేది వప్పుల వీధి అన్నదాన సమాజంలో జరిగింది.

* * *

స్టేట్ బ్యాంకు జిల్లా కోఆర్డినేటర్ శ్రీ పనుమర్తి శివరామయ్య కుమార్తె నిర్మల బి.కాం; తలమంచి, స్వర్గీయ కోకుమర్ల వెంకట సుబ్బయ్య కుమారుడు రాధాకృష్ణశాస్త్రి బిఎస్‌సి, బిఇడిల పెండ్లి 11 తేది నవాబుపేటలో జరిగింది.

* * *

నెల్లూరులో మొట్ట మొదటి మానసిక వైద్య నిపుణుడు, నెల్లూరు ఐఎంఎ అధ్యక్షుడు, మంచి మిత్రుడు, మృదు స్వభావి డాక్టర్ సిఆర్ రెడ్డి తనయ డాక్టర్ సునీత; తిరుపతి, డాక్టర్ మారంరెడ్డి కృష్ణారెడ్డి కుమారుడు డాక్టర్ వంశీధర్ రెడ్డిల పరిణయం 11 తేది నెల్లూరు కస్తూరి దేవి విద్యాలయంలో జరిగింది.

* * *

గోల్డ్‌స్పాట్ కంపెనీగా పిలువబడే పినాకిని బేవరేజెస్ అధినేత, నెల్లూరీయుడు కాక పోయినా నెల్లూరీయులతో ప్రగాఢ స్నేహను బంధాన్ని పెనవేసుకున్న స్నేహశీలి, వివాద రహితుడు, టౌన్‌లో ఏ మంచి కార్యక్రమం జరిపినా తొలి చందాతో బోణీ చేసే ఉదార స్వభావుడు, ఆ సభలోనే గోల్డ్‌స్పాట్ బ్యానర్ కట్టి ఉభయ తారక ప్రయోజనం పొందే తెలివైన వ్యాపారి, నెల్లూరులో కాలు పెట్టిన వేళా విశేష మేమిటో గాని పట్టిందల్లా బంగారం చేసుకో గల్గుతున్న భాగ్యశీలి శ్రీ బోడా చిదంబరం తనయ డాక్టర్ సుధ బిడిఎస్; హైదరాబాదు శ్రీ చిటుమల్ల వీరేశం కుమారుడు నవీన్ ఎంబిఎ (ఆస్ట్రేలియా)ల పరిణయం వైఎంసిఎ గ్రౌండ్స్‌లో 9 తేది ఉదయం అత్యంత వైభవంగా జరిగింది. ద్రవ్యం ద్రవం వలె ప్రవహించిందా రెండు రోజుల శాస్త్రోక్త పరిణయోత్సవంలో! పెండ్లి మంటపం దగ్గర నుంచి విందు భోజనం వరకు; పెండ్లి పత్రిక నుంచి పాట కచేరి వరకు సంపన్నుల కళ్యాణ వైభవం ఎంత కమలు జిగేల్ మన్పించేట్లు వుంటుందో నెల్లూరీయులకు రుచి చూపించారు. అంతగా సంపదను ప్రదర్శిస్తే జనం కన్ను కుడుతుందండీ, చిదంబరం గారూ!

* * *

మాజీ మునిసిపల్ కౌన్సిలర్ శ్రీ గుండ్లపల్లి తల్పసాయి కుమార్తె వెంకట ఉమాదేవి, శ్రీ కె. ఆదిశేషయ్య గుప్త కుమారుడు నాగ ప్రకాశ్ వివాహం 4 తేది వప్పుల వీధి అన్నదాన సమాజంలో జరిగింది.

* * *

నెల్లూరు కో ఆపరేటివ్ బ్యాంకు సూపర్ వైజర్ శ్రీ అవనిగడ్డ వెంకట కృష్ణన్ కుమార్తె వెంకట కామాక్షి సుజాత బి.కాం.; విశాఖ పట్టణం, శ్రీ దువ్వూరి విశ్వనాథం కుమారుడు హనుమంత రావు బి.కాం.ల వివాహం 2 తేది నవాబు పేట కామిశెట్టి సుందర రామయ్య శ్రేష్టి కళ్యాణ మండపంలో జరిగింది.

* * *

శ్రీ ఇప్పగుంట రామమూర్తి కుమారుడు, శ్రీ వెంకట నాగ శ్రీహరిరావు సోదరుడు నరసింహా రావుకి; కందుకూరు స్వర్గీయ కె. వెంకట సత్యనారాయణ గారి కుమార్తె శివ కుమారికి పెండ్లి కందుకూరులోనే 4 తేది జరిగింది.

* * *

నెల్లూరు జిల్లాలో ఒకప్పుడు గుడ్డలంగడి అంటే జనం తమ పేరే గుర్తుకు తెచ్చుకొనేంత సమర్థతతో, జనప్రియత్వంతో వ్యాపారం చేసిన రాయవరపు శంకరయ్య అండ్ సన్స్ అధినేత, ఇప్పటి జెట్ స్పీడు యుగంలో పాత కాలం అలవాట్లు, నాదస్త్రం మానుకోలేక, అట్లని వ్యాపారం వదలుకోనూ లేక అంగడిని కేవలం కాలక్షేప వ్యాపకంగా మాత్రమే నిర్వహిస్తూ, అధిక సమయం భగవంతుడి సేవలో గడిపేస్తున్న సహృదయ మిత్రుడు, మృదుభాషి శ్రీ రాయవరపు బదరీ నారాయణ కుమారుడు ఆర్ఎస్ సుబ్రహ్మణ్యం; విజయవాడ శ్రీ మాజేటి వాసుదేవ రావు కుమార్తె లక్ష్మి సుభాషిణిల పరిణయం జనవరి 31 తేది విజయవాడలో జరిగింది.

* * *

మెట్టు మెట్టుగా ఎక్కి, తన స్వయం ప్రతిభతో బిజెపి జాతీయ స్థాయి నాయకత్వం సరసన స్థానం సంపాదించుకున్న ప్రతిభాశాలి; ఢిల్లీ లెవల్‌కు ఎదిగినా నెల్లూరు పల్లెల్లోని సన్న జనాన్ని మర్చి పోకుండా ఒకే తరహాలో రాజకీయ, స్నేహ సంబంధాలు నెరపుతున్న సహృదయుడు; ఈ రోజు రాష్ట్రంలో ఏ పల్లెకు, పట్టణానికి వెళ్లినా పరిచయం అవసరం లేకుండా పేరు చెప్తే జనం గుర్తించే నాయకత్వ గౌరవం అందుకో గలుగుతున్న ఏకైక కాంగ్రెసేతర రాజకీయ వాది; వేదికెక్కి మైకు పట్టుకొంటే గళంలో నుంచి గంగా ఝరి వలె మాటల ప్రవాహం దుమికి వచ్చే వాగ్ధాటి కల్గిన అరుదైన ఉపన్యాసకుడు; రాజకీయాలలో ఎంత ఉద్రేక పూరితంగా వివాదాస్పద అంశాలను రచ్చ కెక్కించి అధికారంలో వుండే వారిని ముప్పు తిప్పలు పెడతారో, వ్యక్తిగతంగా అంతే సౌమ్యతతో స్నేహ సంబంధాలు చెడి పోకుండా కాపాడు కోగల్గిన లౌకికుడు, మంచి మిత్రుడు, మృదు స్వభావి శ్రీ ముప్పవరపు వెంకయ్య నాయుడు గారి తనయ దీప; నిడదవోలు, శ్రీ ఇమ్మణి విష్ణు రావు తనయుడు వెంకట్‌ల వివాహం జనవరి 31 తేది హైదరాబాదులో ఆత్మీయంగా, శాస్త్రోక్తంగా జరిగింది. బిజెపి అగ్రనేతలే కాదు - అన్ని పార్టీల పెద్ద తలలూ హాజరై ఆశీర్వ చనాలంద జేయడంలోనే వెంకయ్య నాయుడు గారి జనరంజకత్వ విద్య ప్రస్ఫుట మైంది.

హైదరాబాదు వరకు వెళ్లలేని మనబోటి సన్న జనం కోసం 5 తేది నెల్లూరు కస్తూరి దేవి విద్యాలయంలో విందు చేశారు.

* * *

కావలి పెయింటర్స్ వెల్ఫేర్ అసోసియేషన్ అధ్యక్షుడు షేక్ అబ్దుల్ కుమారుడు, జమీన్‌రైతు సంపాదకవర్గ సభ్యుడు రహీం బాన మరది జిలాని ఎం.ఎ.; ఒంగోలు హౌసింగ్ కార్పొరేషన్ అసిస్టెంట్ మేనేజర్ ఎం.ఎ. రజాక్ కుమార్తె నూర్జహాన్‌ల నిఖా 29 తేది కావలిలో జరిగింది.

* * *

నెల్లూరు రెడ్ క్రాస్ సొసైటీ నిర్వాహకుడు; దేశంలో ఏ జిల్లా కేంద్రంలోనూ లేనంత ఆధునిక వసతులతో, స్వచ్ఛంద విరాళాలతో బ్లడ్ బ్యాంక్ నెలకొల్ప డానికి రాత్రి పగలు తేడా లేకుండా శ్రమిస్తున్న సేవా జీవి, వైద్య వృత్తిని వ్యాపార మయం చేయకుండా, విలువలు కాపాడు కొంటూ వస్తున్న ఈనాటి కాలానికి అరుదైన డాక్టరు, ఫీజు కంటే పేదలు చేతులెత్తి దండం పెట్టడమే తన సేవకు సరైన ప్రతిఫలంగా భావించే అల్ప సంతోషి డాక్టర్ ఎ.వి. సుబ్రహ్మణ్యం, డాక్టర్ ఎ. ఉమా సుందరిల కుమార్తె లక్ష్మి, బిహెచ్ఎస్‌సి, బిఎల్; కనిగిరి శ్రీ పునుగోటి సత్యనారాయణ కుమారుడు సురేష్ బాబు ఐఆర్ఎస్‌ల పెండ్లి ఫిబ్రవరి 4 తేది టిటిడి కళ్యాణ మండపంలో జరిగింది.

* * *

దగదర్తి, శ్రీ ఆములూరు రమణయ్య కుమారుడు శ్యామ సుందర్, కాగులపాడు శ్రీ పెనుబల్లి సుధాకరయ్య కుమార్తె కామాక్షిల వివాహం ఫిబ్రవరి 9 తేది బుచ్చిలో జరిగింది.

* * *

కలెక్టరాఫీసు ఉద్యోగి, రెవిన్యూ వర్క్ లోడ్‌ను ఫిర్యాదు లేకుండా నిశ్శబ్దంగా భరించే కల్లూరు సిద్ధయ్య కుమారుడు శ్రీనివాసులు; దామర మడుగు శ్రీ గండవరం కృష్ణయ్య కుమార్తె శ్రీదేవిల పరిణయం ఫిబ్రవరి 15 తేది పొదలకూరు రోడ్డులోని శ్రీ కోదండ రామస్వామి గుడిలో జరిగింది.

* * *

పూడిపర్తి పాత కరణం, గ్రామ పెత్తనపు ప్రాకులాటలో ఆస్తిని హారతి కర్పూరం చేసుకున్న అతి తెలివైన వాడుగా కన్పించే అమాయకుడు. ఎన్నికలు వస్తే తన ఇంటి పండుగగా భావించి కాళ్లకు చెప్పులు లేకుండా తిండీ నిద్రా మర్చిపోయి అసలు కుటుంబానికి అంకితమై పోయి పనిచేసే రాజకీయ నిబద్ధత కల్గిన వ్యక్తి; లోకాలోక పోకడల గోడుకు వెళ్లి రాకుంటే తిండి సగించనట్లు బాధపడే పూడిపర్తి శ్రీ తోటపల్లి పుల్లప నాయుడు కుమార్తె రాజరాజేశ్వరి; బ్రహ్మదేవం శ్రీ మల్లి కార్జునయ్య కుమారుడు రవీంద్ర బాబుల పరిణయం ఫిబ్రవరి 23 తేది ఎన్జీఓ హోంలో జరిగింది. పుల్లయ్య జనప్రియత్వం - కళ్యాణ మండపంలో కిటకిట లాడిన జనంలోనే కన్పించి పోయింది.

* * *

శ్రీ మావులూరు సుందర రామిరెడ్డి గారి కుమార్తె మమత బికాం, నెల్లూరు శ్రీ బాసు చంద్రశేఖర రెడ్డి కుమారుడు గోవర్ధన రెడ్డి బి.ఇ.ల పెండ్లి జనవరి 31 తేది టౌన్ హాల్‌లో జరిగింది.

## కొత్త షేర్లు

2 పేజీ తరువాయి

ఎలక్ట్రిక్, బిఎస్ఇఎస్ వంటి పవర్ కంపెనీలు, ఇతర బ్లూ చిప్ కంపెనీల మీదనే కేంద్రీ కృతమౌతున్నది. సాధారణ బి తరగతి షేర్ల జోలికి వారు వెళ్లడం లేదు. ఆ పరిధిలో జరిగే వ్యాపారాని కంతటికీ స్పెక్యులేషన్ కారణమని సందేహించడం తప్పు కాబోదు.

ఈ పరిస్థితులలో చిన్న ఇన్వెస్టర్లు కొత్త షేర్ల కొనుగోలుకు కొంత కాలం స్వస్తి చెప్పడం మంచిది. ఇది కొనే సీజన్ కాదు - అమ్మే అదను. పెరిగిన ధరలలో షేర్లను అమ్ముకొంటే పాత నష్టాలు కొంత వరకు పూడుతాయి. ఇండెక్స్ 3500 పాయింట్లకు ఎక్కువగా ఇప్పటి కిప్పుడు పెరిగే సూచన లేవీ లేవు. అందువల్ల కొంత కాలం కొనుగోళ్లకు ఓపిక పట్టడం తప్పు కాదు.

## సణుగుడు

4 పేజీ తరువాయి

ఆంధ్ర భూమి దిన పత్రిక అధినేత శ్రీ తిక్కవరపు వెంకట్రామ రెడ్డి నేటిచ్చి ఓట్లను కొనుగోలు చేయడానికి రెండు కోట్లు ఖర్చు పెట్టారట. 40 ఓట్లతో గెల్చే ఎన్నికకు రెండు కోట్ల ఖర్చంటే రాజ్యసభ సభ్యత్వంలోని మాధుర్య మేమిటో అర్థం చేసుకోవచ్చు. సంతలో పశువులను బేరం చేసినట్లు -కక్కుర్తిపడే ఎమ్మెల్యే లెవరో గుర్తించి, బేరమాడి, ఒక్కొక్కరికి ఐదు నుంచి పది లక్షల వరకు చెల్లించి దాదాపు 30 ఓట్లు కొను క్కున్నాడట ఆయన. ఆ 30 లో కనీసం 10 మంది నిజాయితీగా తనకు ఓటు వేసినా తన గెలుపు ఖాయమనే నమ్మకంతో వుండినాడట. కానీ 26 మంది కాంగ్రెసీయులు పోను కేవలం 5 ఓట్లు మాత్రమే ఆయనకు అదనంగా వచ్చాయి. అంటే ఓటుకు డబ్బు తీసుకోవడమే నీచత్వ మనుకొంటే, ఆ డబ్బు తినీ ఓటు ఎగనామం పెట్టి పరమ నీచత్వానికి కూడా పాల్పడి నారన్నమాట మన ఎమ్మెల్యేలలో కొందరు. ప్రత్యర్థివారికి సైతం సైకం వసూలు చేసినందుకు, చెప్పిన సమయం గడిచే దాకా నీతిగా ప్రవర్తిస్తే చాలు! ఆ మాత్రం నైతికత్వం గూడా లేని వారిని చూస్తే ఎంత ఏహ్య భావం జనిస్తుందో వేరే చెప్పాలా?

ఆనాడు పర్యటన అకాశం నుంచి ఊడిపడ్డ ధర్మ స్వరూపులుగా వుంటారని భ్రమపడి, వారిని పల్లెత్తు మాట అంటే ప్రివిలేజ్ భంగం నేరం క్రింద ఎమ్మెల్యేలకు అన్నే క్లాజు చేర్చి పెట్టారు రాజ్యాంగంలో! జనాంతికంగా ఎమ్మెల్యేలు పరువు గడ్డిలో కంటే హీనమై పోయారని వాపోవడం తప్ప, ఆ స్థాయికి దిగజారిన వారి పేర్లు చెప్పి, వారి ఎనతర చరితను వేనోళ్ల పొగడ తరమా? ఈ గ్లానేరి లేకుంటే [illegible] ఓటును అమ్ముకొని... సమయోచిత చేసిన వారి భాగోతం సవివరంగా బయట పెట్టి వుండేవి పత్రికలు; వాటిని చదివి తాము ఎన్నుకొన్న ప్రతినిధు లెంతటి ఉదాత్త పురుషులో అర్థం చేసుకొని జనం తరించి వుండే వారు.

ఎమ్మెల్యేలలో ఇటు వంటి దొంగ లున్నారని భయపడే చంద్రబాబు వారి నందరినీ రామకృష్ణ స్టూడియోస్ అనబడే బందిల దొడ్డిలోకి తోలడానికి యత్నించారు. ఎమ్మెల్యేల నిజాయితీ మీద నాయకులకే అంతటి నమ్మకం వుంటే, జనానికింకెంత వుండాలి?

మరీ ఘోరమైన విషయం - 3 లేదా 4 ఓట్ల కక్కుర్తికి 400 మంది రౌడీ షీటర్లను ఒకేసారి జైలు నుంచి విడుదల చేయడం. పాత బస్తీలో హత్యలకు, దౌర్జన్యాలకు, మత కలహాలకు కారకులైన ఇందరు క్రిమినల్స్‌ను ఒకేసారి వీధుల్లోకి పంపితే జరగబోయే అనర్థా లెట్లా వుంటాయి? అందులోనూ ఎన్నికల సమయంలో ఈ దుష్టులకు స్వేచ్ఛ ప్రసాదిస్తే ఎంతటి వినాశనం దాపురిస్తుంది? జనం ఏమై పోయినా ఫర్వాలేదు, క్రిమినల్స్ చేతిలో హతమైనా నష్టం లేదు, పాత బస్తీ తగల బడినా పట్టించు కోటని లేదు - తమ అభ్యర్థి రాజ్యసభ సభ్యుడైతే చాలు; ఎంతటి మహోదాత్త ప్రజాస్వామిక వాదుల పాలనలో వున్నామండీ మనం?

కమ్యూనిస్టుల సంగతే చూడండి - శ్రీరంగ నీతులు వల్లించే వారూ 8 ఓట్ల కోసం చంద్రబాబు గడ్డం ఒక్క ప్రక్క, దగ్గుపాటి పంచ కొంగు మరొక ప్రక్క పట్టుకొని నేలమీద దేకాడారు. తమలో ఒకరు రాజ్యసభ సభ్యుడు కానంత మాత్రాన దేశంలో కమ్యూనిస్టు ఉద్యమానికి హాని జరిగి పోతుందా? లేక ఆ కక్కుర్తి కోసం పరమ ఛండాలులైన నాయకులతో, దగుల్బాజీ పార్టీలతో కుమ్మక్కైతే కమ్యూనిజం సిద్ధాంతం అపహాస్యం పాలౌతుందా? సిద్ధాంతాలు ఔపోసన పట్టిన వారు - వారే చెప్పాలి.

## నెలూరు ముచ్చట్లు

6 పేజీ తరువాయి

దేనుపు చేస్తుండి. ఈ బాలికను కిడ్నాప్ చేస్తే తమ ప్రయత్నం నెరవేరు తుందని భావించిన అక్కా, బావ అనే ఇద్దరు 23 తేది ఉదయం ఒక కారు తీసుకొని వచ్చి కాపు కాసారు. బాలిక స్కూల్‌లోకి వెళ్లేటప్పుడు రోడ్డు పైకి బలవంతంగా లాక్కొని వచ్చి కారు ఎక్కించారు. బాలిక పెట్టిన కేకలకు ప్రజలు కారు వెనుక పడ్డారు. మాదాల తిమ్మయ్య సత్రం వద్ద కారును అడ్డగించి రాళ్ల వర్షం కురిపించారు. కిడ్నాపర్లకు దేహశుద్ధి చేశారు. సినిమా ఫక్కీలో టౌన్‌లో ఇటువంటి ప్రయత్నం జరగడం పలువుర్ని ఆశ్చర్య చకితులను చేసింది.

# సమ్మర్ క్రాఫ్‌కు భయపడి సినిమా వద్దన్న అరవిందస్వామి!

తిరువనంతపురంలో మణిరత్నం చిత్రం ఆనందం మొదటి షెడ్యూల్ పూర్తి చేసి వచ్చిన ప్రపంచ సుందరి ఐశ్వర్యా రాయ్ ఎన్నో విషయాలు తెలియ జేసింది. ఆ చిత్రంలో ఆమె సినిమా నటిగానే నటిస్తోందట. కథంతా సినిమా నేపథ్యంలోనే నడుస్తుంది. మణిరత్నం ఇది వరకటి చిత్రాల వలె కాక, ఇది కడుపుబ్బ నవ్విస్తుందట. మోహన్ లాల్ ఆ చిత్రంలో హీరో. అతనితో చిత్రాలు తీసి ఎన్నో కంపె కోట్లు సంపాదించాయి. ఒక సంస్థ మాత్రం అనివార్య కారణాల వల్ల చిత్రాన్ని పూర్తి చేయలేక పోయింది. ఆ చిత్రం పూర్తయితే సూపర్ హిట్ అవుతుందన్న నమ్మకం చాలా మందికి ఉంది. దాదాపు ఇరవై లక్షలు సర్దుబాటు అయితే గాని ఆ చిత్రం గట్టెక్కదు. ఇటువంటి స్థితిలో ఆ కంపెనీకి తనకోదైనా వేషం ఇమ్మని అడగడానికి ఐశ్వర్యా రాయ్ వస్తుందట. దానితో కథ అనూహ్యమైన మలుపులు తిరుగుతుందట. ఈ చిత్రంలో ఒక కీలకమైన పాత్రకు నానా పటేకర్‌ను మొదట ఎన్నుకున్నారు. అతని కాల్‌షీట్లు కుదరక పోవడంతో అరవింద స్వామిని అనుకున్నారు. ఇటీవల ఆ పాత్రను ప్రకాష్ రాజ్‌కు ఇచ్చారట. అందుకోసం అతను మీసాలు తీసేసి, సమ్మర్ క్రాఫ్ కొట్టించు కున్నాడట. పాపం ఇటువంటి చిన్న త్యాగం చేయలేక పోయాడేమో అరవింద స్వామి అంది ఐశ్వర్యా రాయ్ నవ్వుతూ.

## సినిమా సమ్మెకు చరమగీతం

మూడు మాసాలుగా అటు నిర్మాతలను, ఇటు కార్మికులను మొత్తం చిత్ర పరిశ్రమనే అతలా కుతలం చేసిన సమ్మెకు భరత వాక్యం పలుకుతూ ఈ నెల 7వ తేదిన సమైక్యతా రాగంతో అందరూ గొంతులు కలిపి చరమ గీతం ఆలపించారు. ఒక రాష్ట్రంలో సమస్యలు ఉత్పన్నమై మొదలైట్టే సమ్మెను ఆ రాష్ట్రానికే పరిమితం చేయాలి గాని, దానిని ఇతర రాష్ట్రాలకు వ్యాపింప జేయకూడదనే అంశానికి ఇరు వర్గాల వారూ అంగీక రించారు.



ఊహ చిత్రంలో ఊహ, విక్రమ్

# తమిళంలో గిరాకీ లేని హీరోలకూ తెలుగులో భలేఛాన్సులొస్తున్నాయి!

కన్నడ, తమిళ హీరోల చేత నటింప జేయడం పొరుగింటి పుల్లకూర రుచి అనే సామెతను నిజం చేసినట్లు వుతుంది. అందరూ మరచి పోయిన విజయశాంతిని మరింత మరిపింప చేసేందుకు నటి రోజా తన "లాఠీ ఛార్జ్" చిత్రంలో పోలీస్ ఇన్స్‌పెక్టర్‌గా నటిస్తోంది. వెడల్పైన మొహం గల జయరామ్ అనే 31 ఏళ్ళ తమిళ హీరోను తన చిత్రంలో నటింప జేస్తోంది. ఇందుకు దర్శకుడు కోడి రామకృష్ణ ఎలా అంగీకరించాడో? ఈ జయరామ్ నటించిన చిత్రాలు తమిళంలో అట్టే హిట్ కాలేదు. "మీరు నటించిన చిత్రాలు అంత బాగా ఆడినట్లు లేదే?" అని అడిగితే "పెద్దగా హిట్ కాలేదన్న విషయం కొంత వరకు ఒప్పుకోవచ్చు. అంతే గాని, ఫ్లాప్ కింద భావించడానికి వీల్లేదు. మొత్తం మీద కమర్షియల్‌గా లాభించినట్లే అనుకోవచ్చు" అంటాడు తెలివిగా. ఏది ఎలా ఉన్నా రోజా గతంలో నిర్మించిన చిత్రం ఫ్లాప్ అయింది గనుక కొత్త చిత్రం "లాఠీఛార్జ్" లాభం తెచ్చి పెడుతుందనే ఆశిద్దాం.

## ఏప్రెల్‌లో "నాయనమ్మ"

ఎం.ఎస్. రెడ్డి సమర్పించే "నాయనమ్మ" చిత్రంలో సురేష్, ఊహ, శారద, నిరోషా, సందీప్ నటించారు. ఏప్రెల్‌లో విడుదల లవుతుంది అన్నారు డైరక్టర్ శివ నాగేశ్వర రావు.

## వాణిశ్రీ దర్శకత్వంలో టి.వి. సీరియల్

దాదాపు 30 ఏళ్లుగా 316 పై చిలుకు చిత్రాలలో నటించిన వాణిశ్రీ ఒక టి.వి. సీరియల్ స్వీయ దర్శకత్వంలో నిర్మిస్తున్నది. ఆ సీరియల్‌కు అవసరమైన కంప్యూటర్ గ్రాఫిక్స్‌ను ఆమె భర్త డాక్టర్ కరుణాకర్ తయారు చేస్తారు. "అమ్మోరు" చిత్రం ద్వితీయార్థంలో కంప్యూటర్ గ్రాఫిక్స్ ఈయన శక్తి కంప్యూటర్ గ్రాఫిక్స్ పనితనమే. జయప్రద, శారద రాజకీయాలలోకి ప్రవేశిస్తున్నారు - మీ సంగతేమిటి? అని వాణిశ్రీని అడిగితే "ప్రజలకు సేవ

కొరవ 11 పేజీలో

# తారల పెండ్లి ముచ్చట్లు

## కుష్బూ రెండవ పెళ్లికి రెడీ!

మురైమామన్ అనే తమిళ సినిమా షూటింగ్‌లో డైరక్టర్ సి. సుందరం అనే యువకుడు నాయిక కుష్బూకు డైలాగులు నేర్పిస్తూ "మేడమ్!" అని సంబోధించాడు "మీరు మేడం అనడం బాగోలేదు కుష్ అంటే చాలు" అంది కుష్బూ నవ్వుతూ "అలాగే ఐతే, మీరూ నేనూ పెళ్ళి చేసుకున్నా మనుకోండి మనకు పుట్టబోయే బిడ్డ ఎవరి పోలికలో ఉంటుంది?" అని అడిగాడు సుందరం. కుష్బూ నిర్ఘాంత పోయింది. "ఏమంటున్నారు?" అడిగింది. "అబ్బే! తమాషాకు అడిగాను. అలా అడగడం తప్పా?" అన్నాడు సుందరం. ఇద్దరూ నవ్వుకున్నారు. ఆ తమాషా త్వరలో నిజం కాబోతోంది. ఇద్దరూ పెళ్ళి చేసుకోవడానికి నిశ్చయించారు. అప్పుడు కాదు ఇంకో మూడేళ్ళు పట్టవచ్చు; అంత వరకు కుష్బూ నటిస్తుంది. పెళ్ళయ్యాక ఆమె నటించదు. దర్శకుడుగా నేనింకా ఎదగాలి. కుష్బూలా సొంత బంగళా, ఇతర ఆస్తులు సమకూర్చు కున్నాక ఆమెతో సరితూగ గలననుకున్న తర్వాతే మా వివాహం జరుగుతుంది. హిందూ సాంప్రదాయం ప్రకారం పెళ్లి చేసుకొంటాం. ముస్లిమ్ సంప్రదాయం ప్రకారం అయితే, నేనే ఆమెకు కట్నం చెల్లించు కోవాలేమో. వివాహానికి మా ఇద్దరు తరఫు పెద్దలూ అంగీకరించారు. కుష్బూ భర్త డైరక్టర్ సుందర్ అనిపించు కోకూడదు. సుందర్ భార్య కుష్బూ అనిపించు కోవాలి. అందుకు మూడేళ్ళు టైమ్ పట్టొచ్చు. అందుకే మూడేళ్ల గడువు పెట్టాను" అన్నాడు సుందర్.

## డిస్కోశాంతి పెళ్లయిపోయింది!

### డిస్కోశాంతి వివాహం

"ఎంత కాలం నేను ఒంటి కట్టెగా ఉంటానని చాలా మంది అడుగుతూ వచ్చారు. నా కోసం ఒక మొగుడు ఎక్కడైనా పుట్టకుండా వుంటాడా అని చెప్తూ వచ్చాను. మా నాన్న పోయాక ఇంటి బాధ్యతలు నా మీద పడ్డాయి. చెల్లెలి పెళ్ళి చేశాను. తమ్ముళ్లకూ పెళ్ళిళ్లు చేశాను. బాధ్యతలు ఒక్కొక్కటిగా పూర్తి చేసుకుంటూ వచ్చాను. శ్రీహరి అనే నటుడు నా దృష్టిలో పడ్డాడు. ఇద్దరి మనసులూ కలిశాయి. ఫిబ్రవరి 21న తిరుమలలో మా వివాహం" రండి అంది డిస్కోశాంతి.

## రమ్యకృష్ణ పెళ్ళి షరతులు!

### రమ్యకృష్ణ పెళ్ళెప్పుడు?

"అప్పుడేనా? ఇంకా నన్ను ఏ దర్శకుడితోనో లంకె పెట్టి మరి కొన్ని గుసగుసలు రానివ్వండి. కొన్ని సంవత్సరాల తర్వాత నా వివాహం ఎటూ జరగక తప్పదు. ఆ యువకుడు మా తల్లి దండ్రుల కన్నా, మా సోదరికి తప్పకుండా నచ్చాలి. పెళ్లయిన తర్వాత కూడా నేను సినిమాలలో నటించాలి. అందుకు ఇష్టపడే యువకుడ్నే చేసుకుంటాను" అంది రమ్యకృష్ణ.

## కథ బాగుంది కాని చూడడానికి బుద్ధి పుట్టడం లేదు!

# పుట్టింటి గౌరవం

కన్నడ చిత్రం "హాలుండ తవరు" ఆధారంగా విజయ నిర్మల దర్శకత్వంలో తెలుగులో పుట్టింటి గౌరవం చిత్రం రూపు దాల్చింది.

పుట్టింటి గౌరవాన్ని కాపాడ వలసిన బాధ్యత కొడుకుల కంటే కూతుళ్లకే ఎక్కువగా వుంటుంది. ఎందు చేతనంటే కూతురు పెళ్లయిన తర్వాత పుట్టిల్లు వదలి అత్త వారిల్లు చేరుతుంది. అత్త వారింటనే పుట్టింటిగా గౌరవం నిలప వలసిన అవసరం కూతుళ్ల మీద వుంటుంది. అత్త వారింటిలో మంచి కోడలుగా, ఉత్తమ ఇల్లాలుగా ప్రవర్తించి నప్పుడు, అత్తింటి వారు ఆమె నడవడికను బట్టి, ఆమె పుట్టింటి గౌరవాన్ని గుర్తిస్తారు. ఆమెను ఆమె తల్లి దండ్రులు మంచి పద్ధతుల్లో పెంచారని మెచ్చుకుంటారు. పుట్టింటి గౌరవం కాపాడేందుకు ప్రతి స్త్రీ తాను మెట్టినింట సహనంతో నడుచు కోవాలి.

ఈ సహనాన్ని, మంచి నడవడికను, అత్త వారింట్లో అందరి పట్ల చూప వలసిన అణకువను, ఆదరాభి మానాలను, తల్లి దండ్రులు తమ కూతుళ్ళకు చక్కగా నేర్పాలి. అంతే కాదు పెళ్లయిన తర్వాత అత్త వారింటికి వెళ్లే కూతుళ్లకు, కోడలుగా అత్త వారింట ఎలా మసలు కోవాలన్నది కూడా తల్లి దండ్రులే బోధించాలి.

అత్త వారింట మంచి కోడలుగా ఉత్తమ ఇల్లాలుగా నడుచు కుంటూ వున్నా, అత్తింటి వారు ఏదో ఒక సాకుతో పుట్టింటి వారిని విమర్శిస్తే, ఆత్మాభిమానం గల స్త్రీ తానైనా మాట పడుతుంది కాని, పుట్టింటి వారి మీద ఒక్క మాట పడనివ్వదు.

ఆడవారికి సంబంధించిన మంచి ఆదర్శ వంతమైన ఇతివృత్తం ఇది. ఈ కుటుంబ కథా చిత్రాన్ని దర్శకురాలు విజయనిర్మల దర్శకత్వంలో తన కున్న స్థాయిలో తీర్చింది. పుట్టింటి గౌరవాన్ని కించ పరచిన సన్నివేశాలను, పుట్టింటి గౌరవాన్ని నిలబెట్టిన సంఘటనలను ఒకే స్థాయిలో రూపు దిద్దింది.

ఈ చిత్రంలో తొమ్మిది పాటలున్నాయి. అందులో ఆరు పాటలు సన్నివేశాల పరంగా సెంటిమెంటు కనపరుస్తూ సాగుతాయి. మిగతా మూడు పాటలు వ్యాపార మార్గం పట్టాయి. సన్నివేశాల కలయికతో సాగిన "అమ్మలేని పుట్టిల్లు ఆకు లేని పొదరిల్లమ్మా", "పుణ్య చరితు ఈ లోకంలో" "పుడమితో తొలి వలపు" "కోవెలలో కొలువుండే దేవుడు"

## తారల కొలతలు- ఎవ్వరికీ చెప్పొద్దు!

హీరోయిన్ల ఎత్తు పల్లాలు కాస్ట్యూమర్ల దగ్గర దాగవు. తెర మీద కన్పించే కొలతలు వేరు; అసలైన కొలతలు వేరు. నిజం మెజర్ మెంట్స్ దాచి పెట్టడానికి ఆడ తారలు చాలా జాగ్రత్తలు తీసుకొంటారు గాని, ఒక్కొక్కసారి వద్దన్నా వెలికి వచ్చేస్తుంటాయి. అటువంటి కొలతలు ఒక కాస్ట్యూమర్ రహస్యంగా ఈ విలేఖరి చెవిలో వూదాడు; మీరు చదివి, రహస్యంగా వుంచండి; ఎవ్వరికి చెప్పొద్దేం!

| కొలతలు | ఛాతీ | నడుం |
|---|---|---|
| భానుప్రియ | 39 అం | 30 అం |
| రోజా | 37 అం | 22అం |
| సిల్క్‌స్మిత | 36 అం | 30 అం |
| మీనా | 38 అం | 28 అం |
| నగ్మా | 39 అం | 29 అం |
| ఆమని | 36 అం | 26 అం |
| కుష్బూ | 40 అం | 30 అం |
| శిల్పాశెట్టి | 37 అం | 27 అం |

శిల్పాశెట్టి మాత్రం తన పొత్తి కడుపు బాగా అగుపించేలా జాకెట్ కుట్టాలని అంటుందట. భగవంతుడు నాకిచ్చిన సంపద అది. దాన్ని నేనెందుకు దాచుకోవాలి? అని కూడా అంటుందట.

పాటలను సహజ కవి డా. మల్లెమాల వ్రాశారు. సాహిత్య పరంగా పాటలకు జీవం పోశారు. ఈ పాటల దృశ్యాలను దర్శకురాలు చక్కగా చిత్రీకరించింది. మాధవపెద్ది సురేష్ సంగీతం కమ్మగా కుదిరింది.

కొరవ 11 పేజీలో

## జనవాణి

3 పేజీ తరువాయి

మధుమేహ వ్యాధితో ఒక కాలు తీసి వేయబడి, దుర్భర స్థితిలో హైదరాబాదులో నివసిస్తున్నారు. కావలి రాజవాల కట్టయ్యను ప్రభుత్వంతో పాటు, సినీ రంగం ప్రముఖులు, వివిధ కళా సంస్థలు ఆదుకోవల్సిన అవసరం ఎంతైనా వుంది.

-కె.సుజాతనాగరాజా రావు

కావలి

### పదవుల కోసం ప్రాకులాట

హవాలా కుంభకోణం చూస్తుంటే నాయకులు పదవులు అడ్డం పెట్టుకొని ఎంత దోపిడీ చేశారో అర్థ మవుతుంది. అందుకే సామాన్యులు కూడా పదవుల కొరకు ప్రాకులాడడం, అడ్డు దోవలు తొక్కడం పరిపాటై పోయింది. కనీసం పంచాయితీ సభ్యుడైనా చాలు, ఏదో ఒక రూపంలో జాలుం చేయవచ్చు అనే ఆలోచనలో కొందరుంటే, ఎమ్మెల్యే కాగానే రాష్ట్ర రాజధానిలో యిండ్ల స్థలాలకు ప్రయత్నించే వారు మరి కొందరు. ఎమ్పీ అయితే ఫోను కనెక్షన్లు, గ్యాసు కనెక్షన్లు, దేశ రాజధానిలో ఫ్లాట్ల సంపాదనతో పరిమిత మవుతున్నారు. ప్రజాసేవ ముసుగులో పదవుల ద్వారా నాయకుల సంపాదన ఎక్కువవడం వల్ల ప్రజాస్వామ్య వ్యవస్థ పైన నానాటికీ గౌరవం పోతున్నది.

నెల్లూరు -పి.వి. నారాయణ

### అటువంటి నాయకులు ఈ రోజుల్లో అరుదు!

పాతిక సంవత్సరాలుగా ఎమ్మెల్యేగా వుండి పైసా కూడా సంపాదించుకోక ప్రస్తుతం దుర్భర దారిద్ర్యాన్ని అనుభవిస్తున్న విజయ నగరం మాజీ ఎమ్మెల్యే జి. సూర్య నారాయణ గూర్చి ఇటీవల ఒక పత్రికలో వ్రాయగా చదివాను. ఈ రోజుల్లో అటువంటి నిస్వార్థ పరులైన నాయకులు అధః పాతాళానికి అణచివేయ బడుతున్నారు. నీతి, నిజాయితీ, నియమం, సిద్ధాంతం వంటి మాటలను 'ఛూ' కొట్టగల ధీమంతులు మాత్రం నేడు రాజకీయ నాయకులుగా కొనసాగు తున్నారు. ప్రఖ్యాత రచయిత్రి మాలతీ చందూర్ చెప్పినట్లు మనకు వచ్చిన స్వాతంత్ర్యం అద్దరు పిల్లలను కన్నది. అది ఒకటి ప్రజాస్వామ్యం, మరొకటి ప్రభుత్వం. ప్రజాస్వామ్యం మళ్లీ ఇద్దరిని కన్నది అవి ఎన్నికలు, శాసన సభ్యులు. తిరిగి ఎన్నికల తల్లి కన్న జంట సంతానం నోట్లు, దొంగ ఓట్లు. ఇప్పుడు ఓట్లు, నోట్లు ఎన్నికలను నడిపిస్తూ మనలను పాలిస్తున్నాయి. డబ్బు, పలుకుబడి, కులం, దౌర్జన్యం ముసుగులో నాయకులు ఎన్నికై పోతున్నారు. ఈ వ్యవస్థను ఎవరు మార్చాలి? ఎపుడు మారుతుంది?

చెర్లోపాలెం -వి. నిరంజన్

### విజయవాడ స్టేషన్ డైరక్టర్‌కు అభినందనలు

ఆలిండియా రేడియో విజయ వాడ కేంద్రం వారు 14 తేది స్వర్గీయ నెల్లూరు వెంకట్రామా నాయుడు జీవిత విశేషాలతో లెక్చరర్ జి. వెంకటేశ్వర రావుచేసిన ప్రసంగాన్ని ప్రసారం చేసారు. అవి విన్న తరువాత అటువంటి రైతు బాంధవుడు మరలా పుడతాడా అనిపించింది. రైతన్నకే మీ ఓటు అని ఎలుగెత్తి చాటిన వాళ్లే ఇప్పుడు ఎక్కడ కనపడు తున్నారు. అసలు రైతుల గూర్చి మాట్లాడే నాయకులు, సమస్యల పట్ల పోరాటం చేసే వాళ్లే కరువయ్యారు. రామానాయుడు గారు లేకుంటే జమీందారీ వ్యతిరేక పోరాటం విజయ వంతం అయ్యేది కాదంటే అతిశయోక్తి కాదు. ఏది ఏమైనా పాత తరం వారికి జమీందారీ వ్యతిరేక ఉద్యమాన్ని మళ్లీ గుర్తు చేసిన విజయవాడ స్టేషన్ డైరక్టర్‌కు అభినందనలు.

నెల్లూరు -గునుపాటి వేణుగోపాల్

### ముఖ్యమంత్రికి అభినందనలు!

తెలుగు విశ్వ విద్యాలయానికి అమరజీవి పొట్టి శ్రీరాములు విశ్వ విద్యాలయంగా పేరు మార్చడం హర్షణీయం. భాషా ప్రయుక్త రాష్ట్రం కోసం 58 రోజులు నిరాహార దీక్ష చేసి ప్రాణాలు అర్పించిన ఘనుడు ఈ దేశ చరిత్రలో మరొకరు లేరు. అటువంటి మహనీయునికి నివాళిగా అటువంటి పని చేసిన రాష్ట్ర ముఖ్య మంత్రి నారా చంద్రబాబు నాయుడికి కృతజ్ఞతలు.

నెల్లూరు -సి.సి.సుబ్బరాయులుశెట్టి



### 50 ఏళ్ళ క్రితం

3 పేజీ తరువాయి

ట్రంకురోడ్డుకు తూర్పున కొత్తగా కట్టిన యిండ్లకు, స్థలాలకు బెటర్ మెంట్ టాక్సు అనే ఒక కొత్త పన్ను అదీ బ్రహ్మాండమైన పన్ను విధించడానికి నోటీసులు వచ్చినవి. తీవ్ర అలజడిగా వుంది. ప్రజా ప్రభుత్వాలు రాబోతున్నవే యీ లోపలెందుకు యీ వెధవ కార్యకలాపం? వివరాలు వచ్చే దఫా.

#### కాఫీ హోటళ్ల సమ్మె

అన్ని ఫలహారాల ధరలు కారణంగా హెచ్చించారు. కాఫీ )-1-6 చేశారు. తినే ప్రజలలో అలజడి హెచ్చింది. కొంత ఘర్షణ గూడా జరిగిందట. అసమ్మతి సూచకంగా అన్ని హోటళ్లు మూశారు. బైట నుండి వచ్చిన వారు దప్ప తక్కిన వారు డబ్బు మిగిలి నందుకు అజీర్ణం తగ్గినందుకు సంతోష పడ్డారు. ప్రతి ఏకాదశి నాడు గూడా ఇట్లానే సమ్మె జేస్తె బాగుండనని మా కోర్కె.

-విమర్శకుడు

### చిత్రజగత్

#### ప్రమాదం

భారత దేశ సినిమా పరిశ్రమ యీ పసి తనంలోనే పెద్ద ప్రమాదాన్ని ఎదుర్కో వలసి వస్తోంది. విదేశీయుల దృష్టి అంతా భారత దేశం మీద వుంది. త్వరలో హాలివుడ్ వారు మన దేశంలో వుపశాఖలు దింపే సూచనలు గోచరిస్తున్నాయి. మన పరిశ్రమలోని వారంతా ఏకమై యీ ప్రమాదాన్ని ఎదుర్కోవాలి. అప్పుడే డిక్సన్ ఆధ్వర్యాన ఒక విదేశ బృందం భారత దేశ సినిమా పరిశ్రమ స్థితి గతులను పరిశీ లించటానికని దిగబడింది. భారత దేశ ప్రజల విషయమై, సమస్య విషయమై ప్రపంచం చాలా శ్రద్ధతో గమనిస్తోంది. మేము కేవలం మీ సినిమా పరిశ్రమను పరిశీలించి, సత్యాన్ని ప్రపంచానికి చాటటానికే వచ్చాం. అంతే. అని డిక్సన్ గారంటున్నారు. ఓహో! ఎంత దయ? రానున్న ప్రమాదాన్ని గుర్తించి అందరు ఏకమై యీ ఒక్క పరిశ్రమనైనా రక్షించు కొంటారని ఆశిస్తున్నాం.

• • •

మాస్కోలో పసి పిల్లలకు ప్రత్యేకమైన సినిమా ప్రదర్శన శాలలు ప్రదర్శనాలు వున్నవి. పెద్దలు యీ ప్రదర్శనాలకు వెళ్లాలంటే పిల్లల సహాయంతోనే పోవాలి.

• • •

## పురుషాధిక్యాహంకారాన్ని నిలదీసి నిర్మూలించాలనే సందేశాత్మక చిత్రం!

# ఊహ

ధనార్జనే ధ్యేయంగా పెళ్లి మీద పెళ్ళిళ్లు చేసుకునే మగవాడు స్త్రీ జాతికి పగవాడు! భార్యగా అటువంటి నీచుడి సరసన పట్టు వరుపుల పై పవళించడం కంటే విధవరాలై క్రింద పడుకోవడం ఎంతో మేలనే విప్లవాత్మక నిర్ణయాన్ని ఓ స్త్రీ మూర్తి అందించడమే ఊహ చిత్రం భావం! నూతన దర్శకుడు శివాల ప్రభాకర్ ప్రతిభకు అద్దం పట్టిన అభినందనీయ చిత్రమిది!

సినిమాలో కొత్తదనం కరువైనా వినూత్నంగా తీయాలనే దర్శకుడి తపన ప్రతిక్షణం ద్యోతకమవుతుంది.

పసుపు రాసి మంగళ స్నానం చేయించిన చందంగా చూపడం, బలి పశువుగా ఆమెను చిత్రీకరించడం చక్కని పోలిక. ఈ సన్నివేశాన్ని గొప్పగా రక్తి కట్టించాడు దర్శకుడు.

**సి. నారాయణరావు**

చనిపోయిన వాణి నుదిటి పై కుంకుమ బొట్టును మోహన్ తన కళ్యాణ తిలకంగా రుద్దు కోవడం, తాను చేసిన పనిని చెప్పకనే చూపించిన సంఘటనతో అద్భుతంగా మలచి నట్లయింది. వాణి

ఊహ చిత్రంలో విక్రమ్, శుభశ్రీ

ప్రారంభ చిత్రంగా సామాజిక స్పర్శతో కూడిన ఓ సందేశం. మగవాడి దౌష్ట్యాన్ని ప్రతిఘటించే స్త్రీమూర్తి పాత్ర చిత్రణ వంటి పోకడలు పోవడమే అభినంద నీయం.

ఉన్నత విద్యా వంతురాలు, ధనవంతు రాలైన ఊహ తన ఆఫీసులో మేనేజరును ప్రేమించడం, ఆ ప్రేమ అంకురించడానికి ఏర్పర్చిన సన్నివేశాలు ఎబ్బెట్టుగా, సినిమోచితంగా ఉన్నాయి. ఆమె తన ప్రేమను మోహన్ చేత అంగీకరింప జేయడానికి, నడివీధిలో అతణ్ణి ముద్దారి కమ్ముల పై పడి గాయ పరచుకుంటాననడంతో ఆ పాత్ర ఔన్నత్యం దెబ్బ తిన్నది. హుందాగా రూపొందించాల్సిన చోట చౌకబారు చేశాడు శివాల!

ఇప్పుడు నన్నేం చేయాలను కుంటున్నావ్? అని ప్రశ్నించిన రెండో భార్య వాణిని, చంపాలను కుంటున్నానని ఆమె తాళిని ఉరిత్రాడుగా మలచి ఆమెను హత్య చేసిన వైనం గగుర్పాటు కల్గిస్తుంది. మోహన్‌లోని కర్కశత్వంతో నిత్యం మన సమాజంలో తారసిల్లే మగ రాక్షసుల్ని చూపించాడు దర్శకుడు, కథకుడు తానే అయిన ప్రభాకర్.

వాణిని చంపే ముందు ఆమెతో ప్రేమ వటించడాన్ని బలిచ్చే మేకకు

చనిపోయిన తర్వాత వాణి తండ్రి పడిన ఆవేదన చిత్రీకరించి వుంటే ప్రేక్షకుడి కంట కన్నీరు చిలికి ఉండేది.

బోసు పాత్ర మాత్రం హాస్యా స్పదంగా కన్పిస్తుంది. తన చెల్లెల్ని చంపిన వాడి పై పగ తీర్చు కోవడం కోసం ప్రతిన బూనినట్లు చెప్పడమే తప్ప ప్రయత్నించక పోవడం, వాణిని చంపేటప్పుడు చేష్టలుడిగి శక్తివంతమైన ప్రతిఘటన ఇవ్వలేక పోయినట్లు చూపడంతో ఆ పాత్ర పేలవమై పోయింది.

సినిమాలో హాస్యం కోసం ఏర్పరచిన ఐరన్ లెగ్ శాస్త్రి తదితరుల సన్నివేశాలు పెద్దగా పండక పోవడంతో హాస్యం లేని వెలితి కన్పిస్తుంది.

వాణిని హత్య చేయించ డానికి పుర మాయించిన రౌడీలు వాణిలోని అమాయకత్వం, ఆదరించే గుణం చూసి, తమ బాధ్యతను విస్మరించి, ఆమెను చంపలేమని, మోహన్‌ను ఆమెతో కాపురం చేయమని హెచ్చరించడం ఆ పాత్ర ఔన్నత్య చిత్రీకరణకు గొప్పగా దోహదం చేసింది. కిరాయి రౌడీల కంటే ఆమె భర్త మోహన్ కసాయి తనం చూపాడు దర్శకుడు.

ఎటొచ్చీ ఊహ, మోహన్‌ను కత్తితో పొడిచి చంపడం గాకుండా, చట్టానికి పట్టించి ఉరికంబానికి ఎక్కించి ఉంటే ఆదర్శ వంతంగా ఉండేది. ఇక్కడ దర్శకుని ఊహ ఉన్నతంగా లేదన్పిస్తుంది. అందుకే పతాక సన్నివేశం ఆమోద యోగ్యంగా కాకుండా పోయింది. ఈ సన్నివేశ కల్పనలో మరింత శ్రద్ధ వహించి వుంటే సినిమా సూపర్ హిట్ అయి వుండేది కూడా!

ప్రభాకర్ స్క్రీన్ ప్లే, మాటలు, పాత్ర చిత్రణలో పని తనం ఆయనలోని సమర్థతను చాటేలా ఉన్నాయి.

ఊహ, శుభశ్రీ చక్కగా నటించారు. విక్రమ్ విలన్‌గా, హీరోగా రెండింటిలో కూడా రాణించ లేదేమో నన్పిస్తుంది. నూతన రచయిత పొందూరి పాటలు అర్థవంతంగా ఉన్నాయి.

## పుట్టింటి గౌరవం

9 పేజీ కొరవ

పరుచూరి బ్రదర్స్ వ్రాసిన మాటలు సందర్భోచితంగా అమరాయి. శ్రీనివాసులు రెడ్డి ఫోటోగ్రఫీ పాటల దృశ్యాలకు సుందర రూపం కూర్చింది.

పుట్టింటి గౌరవం కాపాడిన కోడలుగా సౌందర్య నటించింది. ఈ పాత్రలో నటనకు మంచి అవకాశ ముంది. ఆ అవకాశాన్ని సౌందర్య సద్వినియోగం చేసుకుంది. పుట్టింటి గౌరవం కాపాడే విషయంలో కృష్ణ తన భార్యకు మంచి సహకారం అందించాడు. సాత్వికమైన ఈ పాత్రలో సొంపుగా కృష్ణ రాణించాడు. మిగతా నటులు చంద్ర మోహన్, జె.వి. సోమయాజులు, పి.ఎల్. నారాయణ పాత్రోచితంగా సహజంగా నటించారు.

కన్నడ మాతృక హాలుండతవరు ఆ రాష్ట్రంలో సంచలనం సృష్టించిందట. మైసూరులో ఒకే థియేటరులో 365 రోజులు ఆడిందట. అటువంటి చిత్రానికి అనుకరణగా రూపొందిన పుట్టింటి గౌరవం పట్టుమని పదిరోజులైనా ఆడుతుందా అన్న సందేహం కలుగుతోంది.

ఎంత మంచి కథా వస్తువైనా తెలుగు వారి చేతిలో పడితే మసే కదా!

## సినిమా

9 పేజీ కొరవ

చేయడానికి పాలిటిక్స్‌లో ప్రవేశించాలా?" అన్నారు. ఈమె నెల్లూరు జిల్లా సౌత్ మోపూరులో ఒక పాఠశాల, ఖమ్మం జిల్లా బయ్యన్న గూడెంలో 30 బెడ్ల ఆసుపత్రి నిర్మించిన విషయం అందరికీ తెలిసిందే. వివాహ అనంతరం పదేళ్ల విరామం తర్వాత ఈమె సినిమాలలో పునః ప్రవేశించినా, ఈమెకు తగ్గ పాత్రలు లభించాయి. ఆంధ్ర ప్రేక్షకులూ ఆదరించారు. 15 ఏళ్ల కుమార్తె అనుపమ, 11 ఏళ్ల కొడుకు అభినయ వెంకటేశ్ కార్తీక్‌తో హాయిగా జీవయాత్ర సాగిస్తున్న వాణిశ్రీ ఎందరో ప్రఖ్యాత దర్శకుల వద్ద పని చేసి, ఎంతో అనుభవం గడించారు. మీరెందైనా చిత్రానికి దర్శకత్వం ఎందుకు వహించ కూడదు? అంటే, నా దిత్తా చూపించడానికి టి.వి. సీరియల్ చాలులెండి అందామె నవ్వుతూ.

## లైఫ్‌లో వైఫ్

రాజేంద్ర ప్రసాద్ హీరోగా ఏదైనా చిత్రం తీయాలంటే అటువంటి విచిత్రమైన టైటిల్ పెట్టాలా? రవళి, సంఘవి నాయికలు; రమేష్ రాజా దర్శకుడు.

## నెల్లూరు నిర్మాతల డబ్బింగ్ చిత్రం

నెల్లూరీయులు టి. వెంకురెడ్డి, ఎ. శ్రీధర్ రెడ్డి, నాగిరెడ్డిలు తమిళంలో విజయ వంతమైన ఒక చిత్రాన్ని తెలుగులోకి డబ్ చేస్తున్నారు. రంభ, కార్తీక్, సెంథిల్, గౌండ్రమణి, మణివణ్ణన్ తదితరాలు నటించారు. ఈ రోజుల్లో సాహసించి స్ట్రెయిట్ చిత్రం తీయడం కన్నా డబ్బింగ్ చిత్రాలే గుడ్డిలో మెల్ల!

## నెల్లూరు సంగతులు

4 పేజీ కొరవ

భిన్న రుచులకు అలవాటు పడిన ప్రజలు వారి కోరికలు తీరేందుకు తగిన దైవాన్ని ఎంచుకోవడం వల్లేహిందూ మతంలో దేవతల సంఖ్య పెరిగిందన్నారు. కార్యక్రమానికి రొటేరియన్ జె.వి. రెడ్డి ముఖ్య అతిథిగా విచ్చేశారు. రోటరీ క్లబ్ అధ్యక్షులు ఎం. ధర్మారెడ్డి వక్త చదలవాడ వెంకట శేషయ్యను సన్మానించారు. వర్ధమాన సమాజం కార్యదర్శి టి.వి. నరసింహం తొలుత స్వాగతం చెప్పి, తర్వాత వందనాలు సమర్పించారు.

### కరవు పై సిఎంను కలిసిన బిజెపి నాయకులు

జిల్లాలో ప్రస్తుతం నెలకొని వున్న కరువు పరిస్థితులను ప్రభుత్వం అర్థం చేసుకొని తక్షణం సహాయం చేయాలని హైదరాబాద్‌లో ముఖ్య మంత్రిని కలిసి విన్నవించారు బిజెపి నాయకులు. నెల్లూరుకు సంబంధించిన డాక్టర్ పిహెచ్ వరదయ్య, గడ్డం లక్ష్మి నారాయణ ముఖ్యమంత్రిని కలసి జిల్లాలో ప్రస్తుత పరిస్థితి వివరంగా చెప్పి వచ్చారట. సిఎం సానుకూలమైన నిర్ణయం తీసుకొంటానని కూడా హామీ ఇచ్చినట్లు బిజెపి నాయకులు చెబుతున్నారు.

### సంగీతం స్కూలు వార్షికోత్సవం

మూలపేటలోని శ్రీ మహతి సంగీత, నృత్య విద్యాలయం 8వ వార్షి కోత్సవం సందర్భంగా సద్గురు త్యాగరాజ స్వామి 149 వ ఆరాధ నోత్సవాలు 18 తేది జరిగాయి. వేద సంస్కృత కళాశాలలో ఏర్పాటైన కార్యక్రమంలో ఉదయం విద్యార్థుల ఊరేగింపు, పంచరత్న కీర్తనలు, మధ్యాహ్నం గాత్ర కచ్చేరి, వేణుగాన కచ్చేరి జరిగాయి. లెక్చరర్ డాక్టర్ ఉడాలి నరసింహ శాస్త్రి, న్యాయవాది చివుకుల సత్యనారాయణ మూర్తి, వ్యాపార వేత్త టి. మస్తానయ్య తదితరులు సంగీత, నృత్య ప్రక్రియల్లో యువత ఆసక్తి పెంచు కోవాలని తమ ఉపన్యాసాలలో సలహా యిచ్చారు. అనంతరం స్కూలు విద్యార్థినీ విద్యార్థులు నాట్యాచార్య ఎన్.వి. రమణయ్య నేతృత్వంలో ప్రదర్శించిన భరత నాట్య, కూచిపూడి, జానపద నృత్యాలు ప్రేక్షకులను ఆకర్షించాయి.

### రంజాన్ పండుగ రూటు మారింది!

ముస్లిం సోదరులు సంప్రదాయ బద్ధంగా చేసుకొనే రంజాన్ పండుగ టౌన్‌లో ఈ యేడాది సరికొత్త బాణీలో జరిగింది. 30 రోజుల ఉపవాస దీక్షలు పూర్తయ్యి చంద్రోదయం కాగానే కొందరు యువకులు బాణా సంచా మోతలతో జనం చెవుల తుప్పు వదల గొట్టారు. ముస్లింలు ఎక్కువగా నివసించే జెండా వీధి, కోటమిట్ట, ట్రెంక్ రోడ్డు, బారకాస్ సెంటర్, దాడి పీరి వీధి, గర్బి వీధి ప్రాంతాల్లో చంద్ర వంక గుర్తుతో గల తోరణాలతో వీధులను అలంకరించారు. ఈద్ ముబారక్ అంటూ ప్రతి సెంటర్‌లో బ్యానర్లు కట్టారు. ఈ వీధులన్నీ విద్యుత్ దీపాలతో అలంక రించారు. స్వీట్లు పంచు కోవడం వంటి జనవరి 1 తేది సంస్కృతి తేది రాత్రి టౌన్‌లో ప్రత్యక్ష మయ్యింది.

నెల్లూరులో అతిపెద్ద ఈద్గా అయిన బారా షహీద్ దర్గా వద్ద ఇమాం అబూకర్ ఈదుల్ ఫితర్ ప్రత్యేక నమాజ్‌ను చదివించారు.

### సోమశిల నీటిని తగ్గించారు!

సోమశిల ప్రాజెక్టు నుంచి పెన్నా డెల్టాకు ఫిబ్రవరి 1 తేది నుంచి వదులుతున్న అదనపు నీటిని అధికారులు తగ్గించేశారు. 2,500 క్యూసెక్కులు 15 రోజులు వదలి ప్రస్తుతం దాన్ని 2,000 క్యూసెక్కులకు పరిమితం చేసారు. డెల్టా ప్రాంతంలో కొంత మేరకు పంట పండదంతో ఈ చర్య తీసుకొన్నట్లు ప్రాజెక్టు ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు వి. ప్రభాకర రెడ్డి చెబుతున్నారు.

# వైఎస్ పై కినుకతో పివితో కోట్ల పేచీ!

కాంగ్రెస్ నాయకుల వక్ర బుద్ధి, కుక్క తోక వంకర తోక ఒకే కోవకు చెందినవని మరొకసారి రుజువైంది. రాష్ట్ర రాజకీయాలలో వైఎస్, కోట్లల కీచులాటలు ముదిరి పాకాన పడి, ప్రధాని పివిని కూడా ఇరకాటంలో పెట్టే ప్రమాద స్థాయికి చేరుకున్నాయి.

గత వారంలో ప్రధాన మంత్రి పాల్గొన్న కరీంనగర్ కాంగ్రెస్ సదస్సులో చేశారు. ప్రతిదీ మీ సమక్షంలోనే జరుగుతున్నా మీరు పెదవి విప్పటం లేదు. ఇదంతా వైఎస్ రాజశేఖర రెడ్డి చేయిస్తున్నారన్న సంగతి మీకు తెలుసు, నాకూ తెలుసు. కానీ అతని పై మనం ఎటువంటి చర్యా తీసుకో లేకున్నాం. ఇంతటి నిస్సహాయ పరిస్థితులలో క్రమశిక్షణా సంఘం ఛైర్మన్‌గా కొనసాగడం హాస్యాస్పదం.

ఇది రోశయ్య సుద్దికించి వ్రాసిన లేఖ. కాని, అది పత్రికల వారికి చేరి పోయింది. ఎట్లా చేరిందన్నది బహిరంగ రహస్యమే. వైఎస్ పై తనకున్న కోపంతో, ఆయన్ను భ్రష్టు పట్టించడం కోసం రోశయ్యే స్వయంగా కొందరు విలేఖరులకు ఆ లేఖ జిరాక్స్ కాపీ అందించారు. పివి చెప్పి నప్పటికీ వైఎస్‌ను అదుపు చేసే శక్తి ఆయనకు లేదు. అందువల్ల కోట్ల, వైఎస్‌లు మరింత

మొన్నటి రాజ్యసభ ఎన్నికలలోనూ వైఎస్ అనుచరులైన నలుగురు పార్టీ కోర్ ఎమ్మెల్యేలు తక్కువరవు వెంకట్రామ రెడ్డికి ఓటు చేయలేదని నందే హస్తున్నారు. వెంకట్రామి రెడ్డిని విజయ భాస్కర రెడ్డి స్పాన్సర్ చేయడమే వీరి సహాయ నిరాకరణకు కారణ మంటారు. ఎన్నికలకు ముందే ఈ తీరులో ఒకర్నొకరు సంహరించుకోవడానికి పోటీలు పడుతున్న వీరు, రేపు ఎన్నికలలోనూ అదే వైఖరి నవలం

బించరని గ్యారంటీ ఏముంది? అన్నది సాధారణ కాంగ్రెస్ వాదుల ప్రశ్న.

◆



తనకు జరిగిన అవమానాన్ని కోట్ల విజయ భాస్కర రెడ్డి గారు చాలా తీవ్రంగా పరిగ ణిస్తున్నారు. ఆ సదస్సులో మాట్లాడడానికి కోట్ల లేచి నిలబడి నప్పుడల్లా క్రింద నుంచి జనం రచ్చ చేశారు. మైకు ఎదుట నిలబడి నోరు విప్పనివ్వలేదు. కోపం అణగ ద్రొక్కుకొని, వారిని సమాధాన పరచడానికి ఆయన చేసిన ప్రయత్నాలేవీ ఫలించలేదు. విసిగి పోయి, అవమాన భారంతో వేదిక నుంచి క్రిందకు దిగొచ్చారాయన. ఈ దుశ్చర్యకు కారణం వైఎస్ రాజశేఖర రెడ్డేనని విజయ భాస్కర రెడ్డి అనుమానం. అసలే ఉప్పు నిప్పుగా వున్న వారి సంబంధాలు ఈ సంఘటనతో నిప్పు రాజేయ కుండానే మండి పోయే స్థాయికి ముదిరి పాకాన పడ్డాయి. ఆ కోపంలోనే విజయ భాస్కర రెడ్డి ఎఐసిసి క్రమశిక్షణా సంఘం ఛైర్మన్ పదవికి రాజీనామా చేస్తూ, పివికి ఒక ఘాటైన జాబు వ్రాశారు.

"మీ సమక్షంలోనే నాకీ అవమానం జరిగింది. ఇది కొత్త కూడా కాదు. ఇది వరకూ మీ సమక్షంలోనే నాపై చెప్పులు విసిరారు. మరొక సారి మీ సమక్షంలోనే నన్ను ఇదే మాదిరి గేలి నన్నా బాధ్యత నుంచి తప్పించండి - అదే మీరు నాకు చేసే గొప్ప సహాయ మనుకుంటాను - అని ఘాటైన పదాలు వాడి జాబు వ్రాశారు విజయ భాస్కర రెడ్డి.

అది చదివిన పివికి చిర్రెత్తుక వచ్చినట్లుంది. ఇటువంటి వివాదాలు వచ్చినప్పుడు విని విననట్లు వుండి పోయే తత్వం కల్గిన ఆయన ఎందువల్లో పిసిసి అధ్యక్షుడికి అదే విధమైన పరుష పదజాలంతో జాబు వ్రాశారు. విజయ భాస్కర రెడ్డి లేఖలో ప్రతి వాక్యం ప్రారంభంలోనూ 'మీ సమక్షంలో' అనే పదం వుండడం ఆయన్ను గాయ పరచినట్లుంది. పిసిసి రోశయ్యకు వ్రాసిన లేఖలో వైఎస్ పేరు ప్రస్తావించ కుండా ఇటువంటి సంఘటనలు భవిష్యత్‌లో

జరగడానికి లేదని, ఆవేశ కావేషాలకు లోనై నాయకులను అవమానిం చడమనేది కాంగ్రెస్ సంస్కృతి కాదని గుర్తించి, వీటిని అరి కట్టాలని గట్టిగా మంద లించారందులో! కరీంనగర్ సంఘటన పై విచారణ జరపడానికి రమేష్ చెన్నితలను హైదరాబాదుకు పంపు తున్నానని కూడా ఆ జాబులో ప్రత్యేకంగా పేర్కొన్నారు.

కరీంనగర్ సభలో తనను అవమానించారని కోట్ల మండి పడ్తున్నారు; ప్రధాని ఉత్తరమూ ఉపశమనం కలించలేదు; ఇద్దరి పేచీని రచ్చకెక్కించి వినోదిస్తున్న పిసిసి రోశయ్య!

తీవ్రంగా లడాయి పడితే తన పని నెరవేరి పోతుందన్నది రోశయ్య ఉబలాటం. ఈ కలహాన్ని పెంచి వినోదింప జేస్తున్నారాయన.

లోకసభ ఎన్నికలకు అభ్యర్థుల నిర్ణయం, ప్రచారం ప్రారంభం జరగాల్సిన సమయంలో నాయకులిట్లా కీచు లాడుకోవడం పార్టీకి ఎంత చేటో ప్రత్యేకంగా చెప్ప నవసరం లేదు. కాని, నాయకుల బుద్ధి మారదు. అదే కాంగ్రెస్ సంస్కృతి.




## ఎమ్మెల్యేలు

మొదటి పేజీ తరువాయి

లాక్కున్నారు. విజయ వాడలో జరిగిన సింహ గర్జన సభకు జనాన్ని తరలించటంలో గద్దె రామ్మోహన్ నానా తంటాలు పడ్డారు. కష్ట కాలంలో కూడా ఎన్టీఆర్ గుమ్మం వదలని రామ్మోహన్ ఓటింగ్ ముందురోజు చంద్రబాబు గద్దంలో దూరటంలోని ఆంతర్యం అందరికీ తెలిసిందే. ఇలా వుండగా 25 ఓట్లతో రంగంలోకి దిగిన కాంగ్రెస్ అభ్యర్థి వెంకట్రామి రెడ్డి అటు బాబు గ్రూపు ఇటు ఎన్టీఆర్ గ్రూపు ఎమ్మెల్యేలు 30 మంది వరకు నజరానాలు సమర్పించు కున్నట్లు నగరంలో ప్రచారం జరిగింది. దీనితో చంద్రబాబు తన ఎమ్మెల్యేల్ని రామకృష్ణా స్టూడియోలోకి తరలించి క్యాంపు పెట్టారు. డాక్టర్ వెంకటేశ్వర రావు కూడా తమ వర్గంలో మిగిలిన 33 మంది ఎమ్మెల్యేల్ని తీసుకొని జూబ్లీ హిల్స్‌లోని ఒక ప్రయివేటు గెస్ట్ హౌస్‌లో మకాం పెట్టారు. చంద్రబాబు తన మిత్రులైన ఉభయ కమ్యూనిస్టు ఎమ్మెల్యేల్ని రామకృష్ణా స్టూడియోకు రావల్సిందిగా ఆహ్వానించారు. అయితే కమ్యూనిస్టు ఎమ్మెల్యేలు బాబు ఆహ్వానాన్ని తిరస్కరించి చర్చల నిమిత్తం తమ నాయకుల్ని మాత్రం స్టూడియోకు పంపారు.

### బాబు ఎమ్మెల్యేల ఆగ్రహం

తమ మీద నమ్మకం లేక స్టూడియోలో క్యాంపు పెట్టడం పట్ల చంద్రబాబు శిబిరంలోని ఎమ్మెల్యేలు ఆగ్రహం వ్యక్తం చేశారు. దీనితో ఆయా జిల్లా మంత్రులకు ఎమ్మెల్యేల్ని రక్షించుకొనే బాధ్యత అప్పగించారు. ఎమ్మెల్యేలంతా తమ జిల్లా మంత్రుల ఇళ్లకు వెళ్లి మకాం చేశారు.





Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. Offset Printing at Nayagara Paper Products (India) Limited, Nellore